
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజి
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస
అమ్మ శారదా దేవి
గురు వివేకానంద
గురు సాయిబాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళ స్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

Free Gurukul

"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org

Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

హరిః ఓమ్

# యోగతత్త్వదర్శనము

ఇది రాజయోగము - రెండవభాగము

"యోగసర్వస్వము"

(హఠయోగము)

మొదటి భాగము





చర్లగణపతిశాస్త్రి

## -/ భూమిక /-

ఈ యోగతత్త్వ దర్శనము షడ్దర్శనములలో ఒకటి. దీనిని సేశ్వర సాంఖ్యదర్శన మనియు నందురు. ఇది పతంజలి రచితము. పతంజలి ఈ యోగదర్శనమునే గాక వ్యాకరణ మహాభాష్యమును వైద్యశాస్త్రమును రచించినట్లు ఈ క్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది.

"యోగేన చిత్తస్య పదేన వాచాం, మలం శరీరస్య చ వైద్యకేన యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం, పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి" అని. ఇందులో రాజయోగము అనగా ఉత్తమ యోగము చెప్పబడినది. ఆసన ప్రాణాయామాదులుగల నాహఠయోగము యోగసర్వస్వము మొదటి భాగముగాను ఇది రెండవ భాగముగాను గ్రహింపవలెను.

సమాధిచేఁ బురుష సాక్షాత్కారమును బొందుటయె పరమ పురుషార్థము. సమాధి సిద్ధించుటలో మధ్యగాఁ ద్రికాల జ్ఞానము పరకాయ ప్రవేశము దివ్యశ్రోత్రాదులు అణిమాదులు సిద్ధించుననియు నవి క్షుద్ర సిద్ధులనియు సమాధికి విఘ్నకారులనియు వానికి లోఁబడరాదనియుఁ జెప్పఁబడెను.

అసలు ఈ త్రికాల జ్ఞానాదులు సిద్ధించునా సిద్ధింపవాయన్నది సందేహముగా నున్నది నేఁటి లోకము. అసంభవముగాఁ దోఁచెడి యాకాశయానము దూరశ్రవణ దూరదర్శనాదులు శ్రద్ధా దీక్షాతత్పరతలను బట్టి యంత్రాదులద్వారా సిద్ధించినట్లుగనే ఆ త్రికాల జ్ఞానాదులును సిద్ధించును. యోగులు కొందఱిలో నట్టి సిద్ధులు మనము చూచుచునే యున్నాము. విశ్వాసము దీక్షయు లేనిదే యేవియు సిద్ధింపనేరవు. విశ్వాస దీక్షలతో యోగదర్శనోక్త రీతిగా నాచరించినచో అవి సిద్ధింపఁ గలవు.

యంత్రాల ద్వారా నేఁడు సిద్ధించిన భౌతిక సిద్ధులు శాంతికి మాఱు అశాంతికిఁ దోవ తీయుచున్నవి. ఈ యాధ్యాత్మిక సిద్ధులు మాత్రము జీవుని పవిత్రపఱచుచు అత్యంత శాంతిని గూర్చును. ఇందు చెప్పఁబడిన విభూతులు "పాఠశాలకుఁ బోనని పెంకితనము పూను కుఱ్ఱవానికి మిఠాయి పెట్టి పంపుట" వంటివి. విభూతులను ఆశించియైన సమాధి నభ్యసించి శాంతిని బొందుదురను నాశయముతో నివి చెప్పఁబడెను. అట్లని సిద్ధులు సిద్ధింపవని మాత్రము గాదు. ధ్యాన ధారణ సమాధులు పూర్తిగా సిద్ధించిన పిదపఁ గలుగు సంయమముచే అవి కలుగునని యిందు చెప్పఁబడినది. ఇవి గ్రహించి ఆచరించి వ్రజ తరింతురుగాక.

ఇట్లు,

ఆర్షవిజ్ఞాన పరిషత్తు,
యువ.

బుధ విధేయుఁడు,
చర్ల గణపతి శాస్త్రి.

# విషయసూచిక



———

# యోగ తత్త్వ దర్శనము

## 1. సమాధి పాదము

1. అథ యోగానుశాసనమ్

సూ. మఱి యోగానుశాసన మారంభింపబడుచున్నది.

2. యోగ శ్చిత్తవృత్తి నిరోధః

సూ. చిత్తవృత్తులను నిరోధించుట యోగము.

వివ:- ప్రఖ్య, స్థితి, ప్రవృత్తి అని చిత్తగుణములు మూఁడు. ప్రఖ్య = జ్ఞానరూపమైనది. ఇదిసాత్త్వికమైనది. స్థితి=సంస్కారరూపమైనది. ఇది, తామసము. ప్రవృత్తి= చేష్టారూపము. ఇది రాజసము. క్షిప్తము మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము అని చిత్తావస్థలైదు, క్షిప్తము = అస్థిరము చంచలమైనభావము. మూఢము = మోహయుక్తము, అజ్ఞాన భావము. విక్షిప్తము=స్థైర్యాస్థైర్యయుక్తమువివేకము గలది. ఏకాగ్రము = ఒకదానియందే స్థిరమైయుండునది. నిరుద్ధము=సంస్కారమాత్రమెయుండి వాసనలు లేనిది. చిత్తవృత్తులను గూర్చి ముందుసూత్రములలో వివరింపఁబడును.

3. తదా ద్రష్టుః స్వరూపే అవస్థానం

సూ. చిత్తవృత్తులను నిరోధించినపుడు ద్రష్టకు మూలస్వరూపమందు నిలుకడ గలుగును.

వివ:- మంకెనపువ్వు దగ్గఱనున్న స్ఫటికము ఎఱ్ఱగా నుండును. అది తొలఁగించినచోఁ దిరిగి స్ఫటికము తన తెల్లని రూపము నొందును. ఇట్లే

ఆత్మ చిత్త వృత్తులతో నుండునపుడు ఆ చిత్తవృత్తుల యొక్క రూపము నొందును. చిత్తవృత్తులు లేనపుడు నిత్యము శుద్ధము బుద్ధము ముక్తమైన తన పూర్వరూప మొందును.

4. వృత్తి సారూప్య మితరత్ర

సూ. చిత్తవృత్తు లున్నపుడు ద్రష్ట ఆయా వృత్తులతో సమానమైన రూపము నొందును.

5. వృత్తయః పంచతయ్యః క్లిష్టాఽక్లిష్టాః

సూ. క్లిష్టములు సులభములునై నిరోధింపఁదగిన యా చిత్తవృత్తులైదు విధములు.

6. ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః

సూ. ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా స్మృతులు చిత్త వృత్తులు.

వివ:_ ఇవి ముందు వివరింపఁబడును.

7. ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని

సూ. ప్రత్యక్షానుమాన శాబ్దములు ప్రమాణములు.

వివ:_ తెలియని తత్త్వము బోధపడునట్లు చేయునది ప్రమాణము. ఇంద్రియ సంబంధము వలనఁ గలుగుజ్ఞానము ప్రత్యక్షము. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు వీని సంబంధము వలనఁ గలిగిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ప్రత్యక్షములని భావము. వ్యాప్త్యాది వృత్తిజన్య వ్యాపారము అనుమానము. పొగ యున్న చోట నిప్పు ఉండును. అను అన్వయమును నిప్పు లేనిచోట పొగ యుండదు అను వ్యతిరేకమును వ్యాప్తి యందురు. యోగ్య శబ్దములవలనఁగలుగు జ్ఞానము శాబ్దము.

8. విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్

సూ. వాస్తవిక రూపమందు నిలుకడలేని మిథ్యాజ్ఞానము విపర్యయము

వివ:- ముత్యపుఁజిప్పయందు వెండియను భ్రాంతిజ్ఞానము విపర్యయము.

9. శబ్ద జ్ఞానానుపాతీ వస్తు శూన్యోవికల్పః

సూ. శబ్దవిషయకజ్ఞానమునను సరించిన వస్తుశూన్యమగుజ్ఞానమువికల్పము

వివ:- శబ్దములతో చెప్పవచ్చునుగాని అవి నిజమునకుండవు. గొడ్డురాలికొడుకు వెళ్ళుచున్నాఁడు. ఆకాశపుష్పమును తలలోఁబెట్టుకొనెను. ఎండ మావుల నీటిలో స్నానము చేసెను. చెవులపిల్లి కొమ్ముతో జేసిన విల్లును ధరించెను. పై వానిలో గొడ్డ రాలి కొడుకు మొదలయినవే యుండనపుడు వెళ్ళుట మొదలయినవి యెట్లు. ఇవి విపర్యయ జ్ఞానము లని భావము.

10. అభావ ప్రత్యయాలంబనావృత్తి ర్నిద్రా

సూ. చిత్తవృత్తులు పుట్టకుండుటకుఁ గారణమైనతమోగుణము నవలంబించి యుండువృత్తి నిద్ర.

11. అనుభూత విషయాఽసంప్రమోషః స్మృతిః

సూ. అనుభవించిన విషయములను బోఁగొట్టుకొనక జ్ఞాపకమునకుఁదెచ్చు కొనుట స్మృతిః

12. అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః

సూ. అభ్యాసమువలనను వైరాగ్యమువలనను చిత్తవ్యాపారము నిరోధము గలుగును. వానిని నిరోధించుకొనవచ్చును.

13 తత్రస్థితౌ యత్నః అభ్యాసః

సూ. అందు చిత్తస్థైర్యముకొఱకుఁజేయు యత్నము అభ్యాసము.

14. సతు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః

సూ ఆ యభ్యాసము చిరకాలము నిరంతము సేవించుటవలన బ్రహ్మచర్యాది సమాచరణములవలన దృఢమగును.

15. దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకార సంజ్ఞావైరాగ్యమ్

సూ. ఐహికఫలందును, వేదోక్తములగు స్వర్గాది ఫలములందును ఆశ లేని చిత్తమును వశీకరింపఁ జేసికొనుటయే వైరాగ్యము.

వివ:- వైరాగ్యము, అపరవైరాగ్యము, పరవైరాగ్యము అని రెండువిధములు అందు అపర వైరాగ్యము యతమానసంజ్ఞ, వ్యతిరేకసంజ్ఞ, ఏకేంద్రియసంజ్ఞ, వశీకారసంజ్ఞ అని నాలుగువిధములు. పదార్థార్జనము దానిరక్షణనాశము, హింసాదులగు ననేకదోషములను చూచుట వలనగలుగు జ్ఞానపూర్వకాచరణము యతమానసంజ్ఞా వైరాగ్యము ఈ యింద్రియములు జయింపఁబడినవి. ఇంక నివి జయింపవలసి యున్నవి అనునదివ్యతిరేక సంజ్ఞావైరాగ్యము. బాహ్యేంద్రియ విషయములగు రూపాదులందు రాగద్వేషాదులు నశింపఁగా ఒకమనసు నందేయున్న మానావమానాది విషయక రాగద్వేషాదులను దొలఁగింపఁజేయుట ఏకేంద్రియ సంజ్ఞావైరాగ్యము. పై సూత్రములో చెప్పబడినది వశీకార సంజ్ఞావైరాగ్యము.

16. తత్పర పురుషఖ్యాతే ర్గుణ వైతృష్ణ్యమ్

సూ. పరమపురుష సాక్షాత్కారమువల్ల దీనికంటె తక్కువగుపర్వవిషయము లందు ఆశలేకపోవుటె పర మను వైరాగ్యము.

17. వితర్క విచా రానందాస్మి తానుగమా త్సంప్రజ్ఞాతః

సూ. సవితర్కము, సవిచారము, సానందము, సాస్మితము అని సంప్రజ్ఞాత సమాధి నాలుగువిధములు.

వివ:- సంశయ విపర్యయములు లేకుండ భావింపఁదగిన స్వరూపమును దెలియఁ జేయునది సంప్రజ్ఞాతము. మహాభూతములను, ఇంద్రియములను విషేషావిశేషములను, భూతభవిష్యద్వర్తమాన వ్యవ

హిత విప్రకృష్ణములను, గుణదోషములను చూడనివానిని, వినని వానిని, తెలియబడనివానిని గూర్చి పూర్వాపర సంధానముతో భావనవల్లఁగలుగు సాక్షాత్కారము వితర్కము. దానితోఁగూడిన చిత్తవృత్తినిరోధము సవితర్కము. దోషములను తెలిసికొని స్థూలకార దృష్టినివీడి కారణములయిన శబ్దాదితన్మాత్రలు అహంకారము ప్రకృతి రూపములుగల మహాభూతేంద్రియములు సూక్ష్మార్థములందు క్రమముగా ధారణాధ్యాన సమాధులవలన విశేషావిశేష సాక్షాత్కారము విచారము. విశేషముగా సూక్ష్మవసుపర్యంతము చరించుట విచారము అని వ్యుత్పత్తి. దానితోఁగూడినది సవిచారము ఆ సవిచార దృష్టినిగూడ వీడి ధారణాధ్యాన సమాధులచే వెనుకటివలె ఆ సవిశేషాఽవిశేష రూపముగా జ్ఞాన జ్ఞేయాభేదముగా సుఖాకారమైనది ఆనందము. దానితోఁగూడినది సానందము. ఆనందముగలుగు పర్యంతము దోషదర్శనముద్వారా విరక్తిపొంది ఆధారమయిన పరమేశ్వరునియందు జీవేశ్వరరూపముతో ఒకటియైన కూటస్థచిన్మాత్ర రూపునికి జడములకంటె వేఱైన వివేకముతో ఆత్మ సాక్షాత్కారము గలుగుట అస్మిత దానితోఁగూడినది సాస్మిత. దేహాదులకంటె భిన్నుడను అనుజ్ఞానము. ఇదే చివరి యవస్థ.

. విరామ ప్రత్యయాభ్యాసపూర్వః సంస్కార శేషఃఅన్యః

. ఆ జ్ఞానముగూడ నింకఁ జాలును అను విశ్వాసమే రూపముగాఁగల పరవైరాగ్యమును మటిమాటికి అభ్యసించుటవలన సంభవించిన సంస్కారము మాత్రమే మిగిలిన చిత్తవృత్తి నిరోధము అసంప్రజ్ఞాత మనఁబడును.

. భవప్రత్యయో విదేహ ప్రకృతి లయానామ్

. దేహాపేక్షలేక సిద్ధులై యుండువారికిని ప్రకృతియందే లీనమై యున్నవారికిని భవప్రత్యయమను నసంప్రజ్ఞాత సమాధికలుగును.

_ అసంప్రజ్ఞాతసమాధి, "భవప్రత్యయము ఉపాయప్రత్యయము" అని రెండువిధములు. జన్మమాత్రమే కారణముగాఁగలది అని భవ

ప్రత్యయ పదమున కర్థము. ముందుసూత్రములో ఉపాయప్రత్యయము జెప్పఁబడుచున్నది.

**20. శ్రద్ధావీర్య స్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్**

సూ తదితరులకు శ్రద్ధా, వీర్య, స్మృతి, సమాధి ప్రజ్ఞాపూర్వకమైన యుపాయ ప్రత్యయాఽ సంప్రజ్ఞాత సమాధి గలుగును.

వివ:- శ్రద్ధవల్లవీర్యము, వీర్యమువల్ల స్మృతి, స్మృతివల్ల సమాధి. సమాధివల్ల ప్రజ్ఞ గలుగును. శ్రద్ధాద్యుపాయాలవల్ల ఈ యుపాయ ప్రత్యయమును నసంప్రజ్ఞాతసమాధి గలుగునని భావము.

**21. అధిమాత్రోపాయానాం తీవ్రసంవేగానా మాసన్నః**

సూ. మిక్కిలి వేగముగల యధిక శ్రద్ధాద్యుపాయములు గలవారికి సమాధి యాసన్నమై యుండును.

**22. మృదుమధ్యాధి మాత్రత్వాత్తతోఽపి విశేషః**

సూ. మృదు మధ్యాతిశయ వేగము లుండినయెడల ఒకదాని కంటెనొకదాని కి సమాధి విశేషముగా ఆసన్నమై యుండును

వివ:- శ్రద్ధాదులలో మృదుతీవ్రముగల వానికి ఆసన్నమై, మధ్యతీవ్రము గలవానికి ఆసన్నతరమై. అతిశయ తీవ్రము గలవానికి ఆసన్నతమమై సమాధియుండునని భావము,

**23. ఈశ్వర ప్రణిధానాద్వా**

సూ. ఈశ్వర ధ్యానమువల్లనైనను ఆ సమాధిసిద్ధించును,

**24. క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః**

సూ క్లేశ, కర్మ, కర్మఫలాశయములచేఁ (అంటఁబడని) బరామర్శింపబడని పురుష విశేషుఁ డీశ్వరుఁడు.

వివ: క్లేశములు = అవిద్యా, మమకార, రాగ, ద్వేషాభినివేశములు, కర్మములు = ధర్మాధర్మములు, కర్మఫలములు = జన్మ, ఆయుష్షు భోగములు. ఆశయములు=సంసారవిషయక జ్ఞానాదివాసనలు.

## 25. తత్ర నిరతిశయం సర్వజ్ఞ బీజమ్

సూ. ఈశ్వరునియందు నిరతిశయమైన సర్వజ్ఞత్వ బీజము గలదు.
వివ:- అనగా నిరతిశయ సర్వజ్ఞ నములుగలవాడీశ్వరుడని భావము

## 26. సఏష పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్

సూ. కాలపరిమితి లేనివాడగుటవల్ల పూర్వులకు గూడ నితడేగురువు.
వివ:- పూర్వులు=బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు.

## 27. తస్య వాచకః ప్రణవః

సూ. ప్రణవము ఆ యీశ్వరుని దెలుపును.

వివ:- ప్రణవమనగా ఓంకారము "ప్రణూయతే అనేన" ఎక్కువగా దీనిచే స్తుతింపబడును. లేక "ప్రణౌతి" ఎక్కువగా లోకము దీనినిస్తుతించును గాన ప్రణవము అని వ్యుత్పత్తి. సంకేతముచే పితాపుత్రాదుల నామములవలె సంకేతముచే ఇది ఈశ్వరునికిముఖ్యమైన పేరగునని భావము. అ–ఉ– మ్ = ఓమ్ సృష్టిస్థితిలయ కారణ బ్రహ్మవిష్ణు మహేశ్వర ద్యోతకము ఇందు అకారము స్వరములకు స్థానమైన యేస్థానము నుండియు నుచ్చరింపబడదు. మకారము చివరిదై పెదవులను మూయించుచున్నది. ఉకారము 'అ' నుండి 'మ'వరకు దొరలుచున్నది. ఇట్లు ఓంకారము సర్వశబ్దోచ్చారణ ప్రక్రియను దెలుపుచున్నదిగాన ఇదియే మూలమగు స్వాభావిక సంజ్ఞ. కావున భగవంతుని పేరయినది, "అవతి" దీనిని ధ్యానించుటచే రక్షించునది అనియు ఓం అనుదానికి వ్యుత్పత్తి చెప్పవచ్చును.

28. తజ్జప స్తదర్థ భావనమ్

సూ. ప్రణవార్థమును భావించుటయే యీశ్వరజపము.

29. తతః ప్రత్యక్చేతనాధిగమో అంతరాయాభావశ్చ

సూ. ఆ యీశ్వర జపమువల్ల జీవసాక్షాత్కారమును యోగవిఘ్న నివృత్తియు నగును.

30. వ్యాధిస్త్యానసంశయప్రమాదాలస్యావిరతిభ్రాంతిదర్శనాలబ్ధభూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తే అంతరాయాః

భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తే అంతరాయాః

సూ. వ్యాధులు అసామర్థ్యము సందేహము ప్రమాదము మాంద్యము విషయాభిలాష భ్రాంతిదర్శనము లక్ష్యయోగాసిద్ధి యోగభ్రంశము ఇవి చిత్త విక్షేపకరములగు విఘ్నములు.

31. దుఃఖ దౌర్మనస్యాంగమేజయత్వశ్వాసః ప్రశ్వాసా విక్షేపసహభువః

సూ. దుఃఖము చిత్తచాంచల్యము అవయవకంపము శ్వాస నిశ్వాసాధిక్యము ఇవి విక్షేపమునకుఁ దోఁబుట్టువులు

32. తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః

వివ:- అట్టి యభ్యాసమువల్ల ఏకాగ్రత సిద్ధింపఁగా అంతరాయములు నశింపఁగా నీశ్వరధ్యానము సులభమగునని భావము.

33. మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్

సూ. సుఖవంతులఁ గూర్చి స్నేహము, దుఃఖవంతులఁగూర్చి దయ పుణ్యవంతులఁగూర్చి ప్రీతి, పాపాత్ములఁగూర్చి యుపేక్ష అను వీనిని భావించుటవల్లఁ జిత్తమునకుఁ బ్రసన్నత గలుగును.

వివ:- సుఖవంతులఁగూర్చి యీర్ష్యను దుఃఖవంతులఁగూర్చి తటస్థత్వమును పుణ్యవంతులఁగూర్చి ద్వేషమును పాపాత్ములగూర్చి యను మోదమును పొందరాదని భావము.

## 34. ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య

సూ. ప్రాణవాయువుయొక్క రేచకకుంభక పూరకములచేతనైనను చిత్త ప్రసన్నత గలుగును.

వివ:- రేచకము= కుడిముక్కుతో గాలివిడుచుట. కుంభకము = పీల్చిన గాలిని యథాశక్తిగా లోపలనిలుపుట. పూరకము=ఎడమముక్కుతో గాలినిపీల్చుట. ప్రాణాయామమువల్ల మనస్సుకుఁ ప్రసన్నత గలుగునని భావము.

## 35. విషయవతీవా ప్రవృత్తిరుత్పన్నా మనసః స్థితి నిబంధినీ

సూ. మనస్సునకుఁ గలిగిన దివ్యగంధాది విషయకమైన ప్రవృత్తియును ఏకాగ్రతకుఁ గారణమగును.

వివ: మనస్సును నాసికాగ్రమందు, జిహ్వాగ్రమందు, తాలుజిహ్వాగ్రమందు, జిహ్వామూలమందు నిలుపుటవలనఁ గ్రమముగాఁ గలిగిన దివ్యగంధ, దివ్యరస, దివ్యరూప, దివ్యస్పర్శ, దివ్యశబ్దవిషయకమైన ప్రవృత్తులును ఏకాగ్రతకు అనఁగా చిత్తప్రసన్నతకుఁ గారణములని భావము.

## 36. విశోకావా జ్యోతిష్మతీ

సూ. సాత్త్వికప్రకాశముకలిగిన శోకములేని మనః ప్రవృత్తియును ఏకాగ్రతకుఁ గారణము.

వివ:- హృదయపద్మమందు, కల్లోలములు శాంతించిన సముద్రమువంటి చిత్తసత్త్వమును భావించువాని మనస్సు ప్రసన్నమైయుండునని భావము

## 37. వీతరాగ విషయంవా చిత్తమ్

సూ: వీతరాగులను ధ్యానించు చిత్తముగూడ స్థిరమై యుండును.

వివ:- వీతరాగులైన సనకాదులను ధ్యానించినమనస్సు వీతరాగమై కాముకులను ధ్యానించిన మనస్సు కాముకమై యుండునని భావము.

## 38. స్వప్న నిద్రాజ్ఞానాలంబనంవా

సూ. ప్రపంచమును స్వప్నమువలెను, మేల్కొన్న ప్రాణులను నిద్రించు వారివలెను, విరక్తితో జూచుజ్ఞానమున కాధారమగు మనస్సు గూడ స్థిరమైయుండును.

వివ: నిద్రించువారికి స్వప్నము కనిపించునట్లు, మేల్కొన్న వారికి ఈ ప్రపంచము కనిపించును, దానిని విరక్తితో దాని నిజస్వరూపమును గాంచు వారి మనస్సు ప్రసన్నమై యుండును.

## 39. యథాభిమత ధ్యానాద్వా

సూ. తమకిష్టమైన యే యే దేవతాదుల ధ్యానమువలన గూడ మనస్సు స్థిరమై యుండును.

## 40. పరమాణు పరమ మహత్త్వాన్తో ఒస్య వశీకార

సూ పరమాణువు మొదలుకొని పరమ మహత్త్వపదార్థము వఱకునుండు సర్వమును ఇట్టి స్థిరమైన మనస్సునకు వశమై యుండును.

వివ:- సూక్ష్మవిషయములను భావించుటచే పరమాణువులవరకు వశమైనది అనగా అడ్డు లేనిదగును ఇట్టే మహత్పదార్థమును భావించుటచే మహత్తువఱకు మనస్సు అడ్డులేనిదగును. అన్నిచోట్ల ఇటువంటి మనస్సునకు స్వాతంత్ర్యముండును.

41. క్షీణవృత్తే రభిజాతస్యేవ మణేర్గ్రహీతృ గ్రహణ గ్రాహ్యేషు తత్స్థ తదంజనతా సమాపత్తిః

సూ. క్షీణించిన చిత్తవృత్తులుగల మనుష్యునియందు నిర్మలమైన అద్దమునందువలె గ్రహీత, గ్రహనసాధనములు, గ్రాహ్యములు అను వీని విషయమై బాగుగా తదాకారరూప సాక్షాత్కారమగును.

వివ:- ఇట్టి ధ్యానము కంటె నిండైన విషయము నశించిన మనుష్యుని యందు గలుగునని తెలియవలెను. పై మురికి తుడిచివేయుటవలన అద్దమునందు దాని దగ్గరి వస్తువుల యాకారము భాసించునట్లు వృత్తులు క్షీణించుటవల్ల గ్రహీతలోనగునవి భాసించునని భావము గ్రహీత = పురుషులందఱు, గ్రహణసాధనములు = కర్మేంద్రియము లైదు. జ్ఞానేంద్రియములైదు. మనస్సు, బుద్ధి, అహంకారము, మొత్తము పదమూడు. గ్రాహ్యాదులు = స్థూలసూక్ష్మ సూక్ష్మతరములు అని పంచభూత పంచతన్మాత్ర ప్రకృతిరూపములు.

42. తత్ర శబ్దార్థజ్ఞాన వికల్పైః సంకీర్ణా సవితర్కా సమాపత్తిః

సూ. అందు శబ్దార్థ జ్ఞానములయొక్క వికల్పములచే సంకీర్ణమైన సాక్షాత్కారము సవితర్కమనంబడును.

వివ:- స్థూలసాక్షాత్కారము సవితర్కము నిర్వితర్కము అని రెండు విధములు ముందుగా గోవు అను శబ్దము పిదప ఆవు అను నర్థము పిదప గోమూర్తి జ్ఞానము గల్గును. ఈ మూటికిని అభేదముగాఁగలిగిన భ్రమయే వికల్పము.

43. స్మృతి పరిశుద్ధౌ స్వరూప శూన్యే వార్థమాత్ర నిర్భాసా నిర్వితర్కా

సూ. వికల్పస్మృతి పరిశుద్ధమైనపుడు స్వరూపములేనిదివలె ధ్యేయార్థము మాత్రమే ప్రకాశించు సాక్షాత్కారము నిర్వితర్క మనంబడును.

44. ఏతయైవ సవిచారా నిర్విచారా సూక్ష్మ విషయా వ్యాఖ్యాతా

సూ. ఈ స్థూల సాక్షాత్కారమును బట్టియే సవిచారము నిర్విచారము అని ద్వివిధమై యుండు సూక్ష్మ విషయక సాక్షాత్కారము వ్యాఖ్యానము చేయఁబడినది.

వివ:- స్థూల సాక్షాత్కారమందలి వాసన సూక్ష్మమందు దేశకాల ధర్మాది సూక్ష్మయుక్తముగ సాక్షాత్కరించుట ఇది సవిచారము, గలిగినపిదప కేవల సూక్ష్మవిషయకమై దేశకాల ధర్మాదిశూన్యముగా నగు సాక్షాత్కారము నిర్విచారము.

45. సూక్ష్మ విషయత్వం చాలింగ పర్యవసానమ్

సూ. పార్థివాది పరమాణుసూక్ష్మ విషయక జ్ఞానము సర్వప్రకృతికి మూలకారణమైన యలింగ మను ప్రకృతివఱకు నుండును.

వివ:- ఎక్కడను లయము పొందనిదిగాన అలింగమని వ్యుత్పత్తి. ఈ యలింగమనునది సర్వప్రకృతికి మూలకారణము.

46. తా ఎవ సబీజః సమాధిః

సూ. గ్రహీతృ గ్రహణ గ్రాహ్యవిషయకమైన సాక్షాత్కారములే సంప్రజ్ఞాత యోగసమాధి అగును.

47. నిర్విచార వైశారద్యే అధ్యాత్మ ప్రసాదః

సూ. నిర్విచార సాక్షాత్కారము నిర్మలముగ నున్నపుడు ఆత్మ ప్రసన్నత గలుగును

48. ఋతంభరా తత్ర ప్రజ్ఞా

సూ. ఆత్మ ప్రసన్నత గలిగినపుడు సత్యభరణ ప్రజ్ఞగలుగును

వివ:- ఆత్మ ప్రసన్నత గలిగినపుడు కూటస్థ నిత్యపురుష సాక్షాత్కారమగు
నని భావము.

49. శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యా మన్యవిషయా విశేషార్థత్వాత్

సూ. విశేష ప్రయోజన ముండుటవలన శాబ్దానుమాన ప్రజ్ఞలకంటె యోగ
జన్య ప్రజ్ఞ తదితర విషయమైనది.

50. తజ్జః సంస్కారో అన్య సంస్కార ప్రతిబంధీ

సూ. ఆ ప్రజ్ఞవలనఁగలిగిన సంస్కారము మిగిలిన సంస్కారములను
బోఁగొట్టును.

51. తస్యాపి నిరోధే సర్వ నిరోధా న్నిర్బీజః సమాధిః

సూ. ఆ సంస్కారమునుగూడ నిరోధించినపుడు సర్వము నిరోధించిన
ట్లగుటవలన అసంప్రజ్ఞాత సమాధిగలుగును.

ఇ ది

పతంజలిచే రచింపఁబడి చన్ల గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన
యోగతత్త్వ దర్శనమందు సమాధిపాదము.

— ० —

# 2. సాధన పాదము

1. తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః

సూ. తపస్సు స్వాధ్యాయము పరమేశ్వరార్పణబుద్ధి ఇవి క్రియారూపమైన యోగములు.

వివ:- యోగమునకు మందాధికారి ఆరురుక్షువనువాఁడు. మధ్యమాధికారి యుంజానుఁడనువాఁడు. ఉత్తమాధికారి యోగారూఢుఁడనువాడు మొదటి సమాధిపాదము ఉత్తమాధికారులయిన జడభరతాదులకుఁ జెప్పఁబడినది ఇప్పుడిది మధ్యమాధికారియగు యుంజానునకుఁ జెప్పఁ బడుచున్నది. స్వాధ్యాయము = ప్రణవాదిజపమును, మోక్ష శాస్త్రాధ్యయనమును, తపస్సు మొదలైనవి యాచరింపనివారికి యోగము సిద్ధింపదని భావము.

2. సమాధి భావనార్థః క్లేశతనూ కరణార్థశ్చ

సూ. క్రియాయోగము చిత్తైకాగ్ర్య రూపమగు సమాధిని గలిగించుటకును క్లేశము తగ్గించుటకును నుపయోగించును.

3. అవిద్యాస్మితా రాగద్వేషాభి నివేశాః క్లేషాః

సూ. అవిద్య అస్మిత రాగము ద్వేషము అభినివేశము లు క్లేశములు.

4. అవిద్యాక్షేత్రముత్తరేషాం ప్రసుప్త తనువిచ్ఛిన్నో దారాణామ్

సూ. ప్రసుప్తముగను, స్వల్పముగను, అస్ఫుటముగను, వృత్తిరూపములతో నభివ్యక్తముగను, నున్న యస్మితాదులకు అవిద్యపుట్టిల్లు.

వివ:- అవిద్యాదులు ముందుముందు సూత్రములచే వివరింపఁబడును.

5. అనిత్యాఽశుచి దుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మ ఖ్యాతిరవిద్యా

సూ. అనిత్యమును నిత్యమనియు, శుచిని అశుచియనియు, దుఃఖమును సుఖమనియు, అనాత్మను ఆత్మయనియు తలంచుట యవిద్య.

వి:- ఇది పాపాదులందు పుణ్యత్వాదిబుద్ధుల కుపలక్షణము, సత్యజ్ఞాన విరోధియగు విపరీతజ్ఞానము అవిద్యయని దెలియునది.

6. దృగ్దర్శన శక్త్యో రేకాత్మ తేవాస్మితా

సూ. ద్రష్టృ దర్శనశక్తు లొకటివలె బుద్ధిగలుగుట యస్మిత.

వి:- ఆత్మ శరీరము లొకటిగాఁదలఁచుట యస్మితయని భావము.

7. సుఖానుశయీ రాగః

సూ. సుఖవిషయక మగు క్లేశము రాగము.

8. దుఃఖానుశయీ ద్వేషః

సూ. దుఃఖ విషయకమగు క్రోధము ద్వేషము.

9. స్వరసవాహీ విదుష: అపి తథారూఢ: అభినివేశ:

సూ. విద్వాంసునికిఁ గూడఁ దన సంస్కారముచేఁ గలిగి యవిద్వాంసుని యందువలెఁ బ్రసిద్ధమై యున్న క్లేశ మభినివేశము.

10. తే ప్రతిప్రసవ హేయా: సూక్ష్మా:

సూ. ఆ సూక్ష్మ క్లేశములు చిత్తనాశనముచేత నుచ్ఛేదింపఁదగినవి.

11. ధ్యాన హేయాస్తద్వృత్తయ:

సూ. ఆక్లేశవృత్తులు ధ్యానముచేత నుచ్ఛేదింపఁదగినవి.

12. క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మ వేదనీయః

సూ. వర్తమాన భవిష్యజ్జన్మలందు అనుభవింపఁదగిన ధర్మాధర్మములు క్లేశములకు మూలములు.

వివ:- నందీశ్వరుండు మనుష్య పరిణామమును వీడి ధర్మముచే దేవుఁడయ్యెను అధర్మముచే నహుషుఁడు పాముయ్యెను.

13. సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః

సూ. ధర్మాధర్మములకు మూలమైన క్లేశమున్నపుడే వానికి ఫలములైన జన్మము, ఆయువు, భోగములు గలుగును.

14. తే హ్లాద పరితాప ఫలాః పుణ్యాపుణ్య హేతుత్వాత్

సూ. అవి యిదివఱలోఁ జేయఁబడిన పుణ్యపాపములనుబట్టి గల్గినవి గాన సుఖదుఃఖ ఫలములను గలిగించును.

15. పరిణామతాప సంస్కార దుఃఖై ర్గుణవృత్తి విరోధాచ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః

సూ. పరిణామతాప సంస్కారములవల్లఁ గలిగిన దుఃఖములతో సత్త్వాది గుణ వృత్తులగు సుఖదుఃఖ మోహములకు విరోధము లేకపోవుట వల్లనుగూడ జన్మాదిగుణములు సర్వమును వివేకవంతునికిదుఃఖమే.

వివ:- పరిణామదుఃఖము:- సుఖానుభవకాలములోని సుఖమందు రాగము తదన్యకాలమందు ద్వేషము గలుగును. ఇతర ప్రాణికి బాధలేకుండ ఆ సుఖము అనుభవింపఁబడదుగాన హింసాదులు తప్పవు వానివల్ల అదృష్టాదులద్వారా పిదపదుఃఖము. తాపదుఃఖము: సుఖకాలమందును ఇంకను అధికమగు నితరుల సుఖమును జూచి తాపముగల్గి దానివల్ల వచ్చిన దుఃఖము. సంస్కారదుఃఖము:- సుఖానుభవము వల్లఁగలిగిన యధికసంస్కారముచే దాని స్మరణమువల్ల రాగమును

ఆ స్మరణమున కడ్డురాఁగా ద్వేషము, వానివల్ల కర్మలు, వానివల్ల విపాకము పిదప వాసన కలుగును. యోగికన్నువంటివాఁడు. సాలె పురుగుదారము స్వల్పమయినను కంటిలో పడినవెంటనే చాలా బాధ గూర్చును. కాని యితరమగుచోట పడిన బాధ గూర్పదు. అట్లే అనాది దుఃఖప్రవాహము స్వల్పముగా నున్నను ఇతరునిగాక యోగినేబాధించునని భావము. దుఃఖమునకు మూలము అవిద్య. వివేకజుకలుగఁగా అవిద్య నశించును. పిదపఅవిద్యామూలములగు క్లేశములు పోవును. పిదప పాపపుణ్యములుగలుగవు ఇదివఱకటి పాపాదులు అనుభవించుట వల్లను దేహాంతమున నింక పూర్వపాపాదులు లేవు గావునను బునర్జన్మ లేదు. దానినే మోక్షమందురు. ఈ శాస్త్రము చతుర్విధము, 1. హేయము = సాంసారిక దుఃఖము, 2. హేయహేతువు=సాంసారిక దుఃఖహేతువగు నవిద్య. 3. హానము= సర్వదుఃఖనివృత్తిమోక్షము. 4. హానోపాయము=మోక్షసాధనమగు వివేక సాక్షాత్కారము.

## 16. హేయం దుఃఖ మనాగతమ్

సూ. రాఁబోవు దుఃఖములు పోఁగొట్టుకొనఁదగినవి.

వివ. కడచినవి యనుభవించినఁగాని పోగొట్టుకొనుటకు వీలులేదు కడచుచున్నవిగూడ ఎప్పటికప్పుడే యతని వివేకముచే నశించును ఇంక మిగిలినవి రాఁబోవునవే. ఇదివఱకు తగిలినగాయముయొక్క బాధ అనుభవముచే పోవును. వర్తమానమందు జాగరూకతచే తగలదు, రాఁబోవునది పోగొట్టుకొనవలయును.

## 17. ద్రష్టృ దృశ్యయోః సంయోగో హేయ హేతుః

సూ. ద్రష్టకును దృశ్యములగు సుఖదుఃఖ మోహములకును గలసంబంధము దుఃఖమునకు హేతువు.

18. ప్రకాశక్రియా స్థితి శీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యమ్

సూ. ప్రకాశశీలమైన యాత్మయు, క్రియాశీలమైన దశేంద్రియములును స్థితిశీలమైన భూతములును, భోగమోక్షములై దృశ్యము అని చెప్పఁబడును.

విశ: ప్రకాశ క్రియా స్థితి శీలములనఁగా సత్త్వరజస్తమోగుణ శీలము అని భావము.

19. విశేషావిశేష లింగమాత్రాలింగాని గుణపర్వాణి

సూ. విశేషములు, అవిశేషములు. లింగమాత్రములు అలింగములు అనునవి గుణము లనెడి చెట్లకుఆకులుకొమ్మలు మొలకలు గింజలవంటివి

విశ:- ఇంద్రియములు 10. మనస్సు 1. భూతములు 5. మొత్తము 16 వికారములు. ఇవి విశేషములనఁబడును. శబ్ద స్పర్శ రూప రసగంధములనెడి పంచతన్మాత్రలు అయిదు, అహంకారము ఒకటి. మొత్తము 6 విశేషములనఁబడును. లింగమాత్రము- మహత్తత్త్వము అలింగము గుణముల సామాన్యస్థితి.

20. ద్రష్టా దృశిమాత్రః శుద్ధః అపి ప్రతయానుపశ్య;

సూ. జ్ఞానమాత్ర రూపుఁడైన ద్రష్ట శుద్ధుఁడైనను బుద్ధి వృత్తులను అనుకరించువానివలె విషయములను జూచును.

21. తదర్థ ఏవ దృశ్యస్యాత్మా

సూ. దృశ్యముయొక్క స్వరూపము ఆద్రష్టయొక్క భోగమోక్షములే ఫలముగాగలది.

**22.** కృతార్థం ప్రతి నష్ట మప్యనష్టం తదన్యసాధారణత్వాత్

సూ. పురుషార్థము సిద్ధించిన పురుషునిగుఱించి దృశ్యములు నశించినను పురుషార్థసిద్ధి పొందనివారికి సాధారణ మగుటవల్లనవి నశింపవు.

వివ- సిద్ధిపొందనివారికై యవి యెల్లకాలము నుండునని భావము.

**23.** స్వస్వామిశక్త్యోః స్వరూపోపలబ్ధిహేతుః సంయోగః

సూ. భోగ్యమగు దృశ్యమునకు భోక్తయగు ద్రష్టకును విషయముల ననుభవించుట కొఱకును ఆత్మను దర్శించుట కొఱకును హేతువైనది సంయోగము.

**24.** తస్య హేతు రవిద్యా

సూ. ఆసంయోగమునకు అవిద్య మూలకారణము.

**25.** తదభావాత్సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్

సూ. అవిద్య లేనందువలన దృశ్యముతో సంయోగము గలుగక పోవుటయే మోక్షము. అదే చైతన్యమునకుఁ గైవల్యము.

**26.** వివేకఖ్యాతి రవిప్లవా హానోపాయః

సూ మిథ్యాజ్ఞాన వాసనవల్ల బాధనొందక ప్రకృతి వివేచనమువల్లఁ బురుష సాక్షాత్కారము పొందుటయే మోక్షోపాయము.

**27.** తస్య సప్తధా ప్రాన్తభూమిః ప్రజ్ఞా

సూ యోగజ సాక్షాత్కార రూపమైన మోక్షోపాయముయొక్క ప్రజ్ఞ యేడు విధములుగ నున్నది.

వివ:- 1 హేయమైన దుఃఖమును దెలిసికొంటిని ఇంకనేను దెలిసికొనవలసినది లేదు [illegible] ప్రజ్ఞ 2 దాని ఫలానుభవము పొందుట వల్ల [illegible] దవలసినది లేదు అనునది రెండవప్రజ్ఞ 3 హే యు

హేతువులైన అవిద్య, సకామకర్మ మొదలగునవి పూర్తిగానశించి నవి ఇంకనేనశించవలిసినవి లేవు అనునది మూఁడవప్రజ్ఞ. 4 దుఃఖ హీనరూపమైన మోక్షఫలము అసంప్రజ్ఞాత యోగముచేత సాక్షాత్క రింపఁబడినది. ఇంక తెలిసికొనవలసిన పురుషార్థము మిగులలేదు అనునది నాల్గవప్రజ్ఞ. 5 నాబుద్ధి సమాప్తభోగ మోక్షములు గలది కాఁగలదు అనునది ఐదవప్రజ్ఞ 6 బుద్ధిరూపముగాఁ బరిణమించిన సత్త్వాదిగుణములు స్వకారణమందు లయింపఁగల వనునది ఆఱవ ప్రజ్ఞ. 7 లయించిన యాగుణములు కొండమీద నుండిపడిన రాళ్ళు మరలఁబైకిచేరనట్లుగా తిరిగి బుద్ధిరూపముగాఁ బరిణమింప వనునది ఏడవప్రజ్ఞ. ఈ ఏడింటిని చరమములో కిఁ దెచ్చుకొనిన విద్వాంసుని జ్ఞానినిష్ఠ సద్యోముక్తిదాయిని యగునని తెలిసికొనవల యును.

28. యోగాంగానుష్ఠానా దశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేక ఖ్యాతేః

సూ. యోగాంగముల ననుష్ఠించుటవలన ప్రకాశమునావరించు క్లేశములు నశింతఁగా ప్రకృతిపురుష వివేక సాక్షాత్కారము పర్యంతము జ్ఞాన దీప్తి అగును.

29. యమనియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధార ణా ధ్యాన సమాధయో ఽష్టావంగాని

సూ. యమ, నియ, మాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన సమాధు లెనిమిది యోగాంగములు.

31. తత్రాఽహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాఽ పరి గ్రహాయమాః

సూ. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఇవి యమము లనఁబడును.

వివ:- అహింస= ప్రాణులను మనసా, వాచా, కర్మణా హింసింపకుండుట సత్యము = వాఙ్మనసముల యథార్థత్వము. అస్తేయము = ఇతరుల ధనములపహరింపఁ బోవుట, బ్రహ్మచర్యము = అష్టవిధమైన మైథు

పములు త్యజించి పరమేశ్వరునియందుఁ జరించుట. స్మరణం కీర్తనం, కేళిః, ప్రేక్షణం గుహ్యభాషణం।సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతి రేవచ". స్మరణము. కీర్తించుట, కలిసియాడుట, చూచుట, రహస్య సంభాషణము, సంకల్పము, ప్రయత్నము, క్రియానిర్వాణము ఇవి యష్టవిధమైథునములు. అపరిగ్రహము= హింసాదులగు ననేక దోషములు వానివల్ల గలుగుచుండుటచే పదార్థములను స్వీకరింపకుండుట.

**31. జాతి దేశకాల సమయానవచ్ఛిన్నాః సార్వభౌమా మహావ్రతమ్**

సూ జాతి, దేశ, కాల, సమయముల నియమములేకుండ సర్వ జాత్యాది సాధారణములైన యహింసాది యమములు మహావ్రతములనఁబడును

వివ:- జాతి=మనుష్యత్వాదులు, దేశ=తీర్థాదులు, కాల=చతుర్దశి అమావాస్య మొదలగునవి. సమయములు=యుద్ధాదులు.

**32. శౌచసంతోషతపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః**

సూ. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, దైవప్రణిదానము ఇవి నియమములు,



వివ:- దైవప్రణిధానము=పరమేశ్వరార్పణబుద్ధి.



**33. వితర్కబాధనే ప్రతిపక్ష భావనమ్**



సూ. వితర్కాదులచే యమాదులకు బాధకలుగుచున్నను ప్రతిపక్షభావము చేయవలయును.



వివ:- "వీనిని జంపెదను అనృతమైనను పలుకుదును పరధనమైననుఅపహరింతును. పరస్త్రీగమనమైనఁ జేయుదు"నను దుష్టమార్గములచే బాధింపఁబడినపుడు సంసారాగ్నిచేఁ గాల్చఁబడి యాబాధనుండి మరలుటకై యోగధర్మమును శరణు జొచ్చితిని. ఇట్టినేను మరల ఆ దుర్మార్గములలోనే పడినచోఁ "కుక్కబుద్ధివంటివాఁడ నగుదును. కక్కినకూడు తిన్నవాఁడనగుదునని ప్రతిపక్ష భావన చేయవలయునని భావము.

**34. వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా లోభ క్రోధ మోహపూర్వకా మృదుమధ్యాధిమాత్రా దుఃఖా జ్ఞానానన్తఫలా ఇతి ప్రతిపక్ష భావనమ్**

సూ. వితర్కములని పిలువఁబడు హింసాదులు లోభ క్రోధమోహ పూర్వకములై మృదుమధ్యాతి ప్రమాణములై చేయఁడినను, చేయింపఁబడినను అనుమతింపఁబడినను దుఃఖము అజ్ఞానము అనేడి యంతులేని చెడ్డఫలముల నొసంగునని ప్రతిపక్షభావన చేయవలయును.

**35. అహింసా ప్రతిష్ఠాయాం తత్సంనిధౌ వైరత్యాగః**

సూ. అహింసయందు స్థిరత్వము సిద్ధింపఁగా అహింసకుల సన్నిధియందు సర్వప్రాణులయందు వైరత్యాగము గలుగును.

వివ:- మనుషులలోని వైరములు, పిల్లి యెలుక, మేక, పులి మొదలగు వానిలోని సహజవైరములు, సర్ప శార్దూల సింహాదులకు ఇతర ప్రాణులను గుఱించిన వైరములును పోవునని భావము.

**36. సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం**

సూ. సత్యమందు స్థిరత సిద్ధింపఁగా సత్యవంతుల మాట మాత్రముచేత ధర్మాది క్రియలును స్వర్గాది ఫలములును సిద్ధించును.

**37. అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్**

సూ. అస్తేయ ప్రతిష్ఠ గలుగఁగా సర్వరత్నములు వాని మాటచేతనే సిద్ధించును.

వివ:- సర్వరత్నములు=సర్వశ్రేష్ఠవస్తువులని భావము.

**38. బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః**

సూ. బ్రహ్మచర్య ప్రతిష్ఠ గలుగఁగా అలౌకిక సామర్థ్యము గలుగును.

## 39. అపరిగ్రహస్థైర్యే జన్మకథన్తాసంబోధః

సూ. అపరిగ్రహ స్థైర్యము గలుగఁగా పూర్వాపర జన్మస్మృతిగలుగును.

వివ:- "నేనెవఁడను ఎట్లుంటిని ఇది యంతయునేమి మనము ముందెట్లు గాఁగలము" మొదలుగ సర్వస్మృతులు గలుగునని భావము.

అవతారిక:- ఇంతవరకు యమస్థైర్యమందు సిద్ధులు చెప్పఁబడెను. ఇంక నియమ స్థైర్యమున సిద్ధులు చెప్పఁబడుచున్నవి.

## 40. శౌచాత్స్వాంగజుగుప్సా పరైరసంసర్గః

సూ. శౌచస్థైర్యము వల్ల శరీరమందు జుగుప్సయును ఏవగింపు పరులతో అసంసర్గమును గలుగును.

వివ:- మట్టి, నీరు మొదలగువానిచే ఎంతశుద్ధిగావించినను శరీరశుద్ధి గలుగక దినదినము ఎప్పుడుమానిన నప్పుడే శరీర మపరిశుద్ధ మగుచుండుటవల్ల ఈభౌతిక శరీరమందు జుగుప్స గలుగును. స్వశరీరమందే జుగుప్స గలిగినప్పుడు ఇంక వ్యామోహకరములగు భార్యాపుత్రాది పరశరీరములందు జుగుప్స గలుగుటలో వింతయేమియని భావము.

## 41. సత్వశుద్ధిసౌమన స్యైకాగ్ర్యేన్ద్రియజయాత్మ దర్శన యోగ్యత్వాని చ

సూ. శౌచస్థైర్యమువల్ల సత్త్వశుద్ధియు దానినుండి సౌమనస్యము దానినుండి ఏకాగ్రత దానినుండి యింద్రియజయము దానినుండి ఆత్మదర్శన యోగ్యతయును గలుగును.

## 42. సంతోషాదనుత్తమ సుఖలాభః

సూ. సంతోష స్థిరతవల్ల నత్యుత్తమమైన యనంత సుఖము గలుగును.

వివ:- యచ్చ కామసుఖంలోకే, యచ్చ దివ్యం మహత్సుఖం
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హతః షోడశీంకలాం॥
"లోకమందలి కామసుఖము మహాదివ్యసుఖమును తృష్ణానాశమువలని సుఖమునకుఁ బదునాఱవవంతయినను గావు."

**43. కాయేన్ద్రియ సిద్ధిరశుద్ధిక్షయాత్తపసః**

సూ. తపస్సు పాపమును నశింపఁజేయునదిగాన కాయసిద్ధిని, ఇంద్రియసిద్ధిని గలిగించును.

**44. స్వాధ్యాయాదిష్టదేవతాసంప్రయోగ:**

వివ:- కాయసిద్ధి=అణిమాదిసిద్ధి, ఇంద్రియసిద్ధి=దూరశ్రవణాదులు.
సూ. స్వాధ్యాయమువల్ల సిష్టదేవతాదర్శనము గలుగును

**45. సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్**

సూ. దైవప్రణిధానమువల్ల (ధ్యానము)సమాధిసిద్ధి గలుగును.

**46. స్థిరసుఖమాసనమ్**

సూ. స్థిరము సుఖకరమునైన యాసనము వేయవలెను.
వివ:- ఆసనములు వానిభేధములు హఠయోగ దీపికాది గ్రంథములయందు దెలియవలెను. (చూ. నా యోగసర్వస్వము)

**47. ప్రయత్నశైథిలానన్త్య సమాపత్తిభ్యామ్**

సూ. చలనాది ప్రయత్నములను ముగించుటవల్లను భూమినిదాల్చిన యాదిశేషునియందు చిత్తము నిలుపుటవల్లను ఆసనసిద్ధి గలుగును.
వివ:- సమస్తగోళములు ఆకాశమున ఆకర్షణశక్తిచే వాయువుచే నిలుపఁబడుచున్నవిగాన అవాయు ప్రవాహమునే పవనాహారియగు నాదిశేషువుగ ఆరోపింపఁబడెనని తెలియునది.

**48. తతోద్వంద్వానభిఘాతః**

సూ. ఆసనస్థైర్యమువల్ల శీతోష్ణాది ద్వంద్వ బాధ గలుగదు.

**49. తస్మిన్సతి శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః**

సూ. ఆసనస్థైర్యము గలుగఁగా శ్వాసనిశ్వాసములగతిని నిరోధించుట ప్రాణాయామము.

వివ:- ప్రాణాయామములో గాయత్రీజపముగాని, ప్రణవజపముగాని యిష్ట దేవతాది ధ్యానముగాని చేయవలయును.

**50. బాహ్యాభ్యన్తర స్తంభ వృత్తిర్దేశకాల సంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః**

సూ. బాహ్యాభ్యంతర స్తంభవృత్తియైన ప్రాణాయామము దేశకాలసంఖ్యా వృత్తులచే నియమితమై దీర్ఘసూక్ష్మమని చెప్పఁబడును.

వివ:- బాహ్యవృత్తి=రేచకము. అభ్యంతరవృత్తి=పూరకము. స్థంభవృత్తి= కుంభకము. ఎడమముక్కునుండి గాలివిడుచుట రేచకము. దీని ప్రదేశ దూరమును అక్కడి దూదిపింజ కదలికనుబట్టి తెలియనగును కుడిముక్కుతో గాలిపూరించుట పూరకము. పీల్చిన గాలిని లోప కుంభించుట కుంభకము. రేచకమునకు ముక్కుచివరనుండి 12 అంగుళములు పరిమితిగల దేశము "ప్రాదేశ ద్వాదశాంగుళ హస్తా దిపరిమితో దేశః" చీమలు లోన ప్రాకుచున్నట్లుండుటనుబట్టి అది తెలియును. పూరకమునకు ఆపాదతల మస్తకపర్యంతము అభ్యం తరదేశము. ఇది దేశనియమము. రేచకపూరక కుంభకములలో కాలనియమము చేయవలయును. ఇంతకాలము గాలివిడుచుట ఇంత కాలము గాలిపీల్చుట, ఇంతకాలము గాలినిలుట అనికాలనియమము

రేచకమునందు 32 మాత్రలు, పూరకమునందు 16 మాత్రలు, కుంభకమునందు 64 మాత్రలు అని వసిష్ఠుడు. ఇది సంఖ్యానియమము ఇది మృదువు దీనికి రెట్టింపు యైనచో మధ్యమము. నాలుగురెట్లు యైన తీవ్రమగును. ఇది ప్రతిదినము అభ్యసింపబడి దివస పక్ష మాసాది క్రమముగా దేశకాల పరిచయవ్యాపియై దీర్ఘమనిమిగుల నైపుణ్యముగా దెలిసికొనదగి సూక్ష్మమని చెప్పబడును. అది చీమ ప్రాకుట దూది కదలిక మొదలగునవి తెలియకపోవుట మొదలగు వానివలన సూక్ష్మత్వము తెలియవలయును. శక్యమైనంత వఱకు నిల్పవచ్చునని యాజ్ఞవల్క్యుడు.

## 51. బాహ్యాభ్యన్తరవిషయాక్షేపీ చతుర్థః

సూ. బాహ్యాభ్యంతర విషయములైన రేచకపూరకముల నతిక్రమించి కేవల కుంభకము మాత్రమే యుండునది నాల్గవ ప్రాణాయామము

ప్రాణాయామము:-

బ్రహ్మాదయోపి త్రిదశాః పవనాభ్యాసతత్పరాః
అభూవన్నంతకభయా త్తస్మాత్పవన మభ్యసేత్.

బ్రహ్మాది దేవతలుకూడ యమునిభయమువల్ల రేచక, పూరక, కుంభకములనెడి ప్రాణాయామములను సలిపిరి. గాలిని విడచుట రేచకము, గాలినిపీల్చుట పూరకము, గాలినిలోపలనిలుపుట కుంభకము

జన్మౌషధి తపోమంత్రై ర్యావతీహచ సిద్ధయః.
యోగేనాప్నోతి తాః సర్వాః, నాన్యైర్యోగ గతింవ్రజేత్.

జన్మౌషధము తపస్సు మంత్రములవే నెటువంటిసిద్ధులు కలుగునో అవి ఆసన ప్రాణాయామములచే సిద్ధించును. సూర్యభేదము ఉజ్జాయి, సీత్కారి, శీతలి, భస్త్రిక, భ్రామరి, మూర్ఛ, ప్లావని అని కుంభక ప్రాణాయామములు ఎనిమిది. పూరకాంతేతు కర్తవ్యో బంధో జాలంధరాభిధః, కుంభకాంతే రేచకాదౌ కర్తవ్య స్తూడియానకః. గాలి నిపీల్చునపుడు జాలంధరబంధము చేయువలెను. అనగా గడ్డమును గుండెపై ఆనించవలయును. గాలిని నిలిపి గాలినివిడుచు

వఱకు మూలబంధమును (మలద్వారమును బంధించుట) ఉడ్యాన బంధమును (పొట్టను వెనుకకు అక్కళించుచు లాగుట) చేయవలయును. ఇవి తప్పక చేయవలయును. ఇట్లు చేయక కుంభకము చేయరాదు.

అపానమూర్ధ్వ ముత్థాప్య ప్రాణం కంఠాదధో నయేత్,
యోగీ జరామరణనిర్ముక్తః షోడశాబ్దవయా భవేత్.

మలద్వారబంధము చేయుటద్వారా అపానవాయువును పైకిలేపి జాలంధరబంధము (గాలినిపీల్చినపిదప గడ్డమును గుండెపై ఆనించుట) ద్వారా ప్రాణవాయువును క్రిందికిపంపి ఉడ్యానబంధము ద్వారా (పొట్టను అక్కళించి వెనుకకు లాగుటద్వారా) ప్రాణాయామము చేసినచో యోగి ముసలితన నుండి విడివడి 16 ఏండ్లవయసువాడుఅగును అవిహఠయోగ దీపికలో చెప్పఁబడెను. ఇది యోగులకు అనుభవసిద్ధము. ప్రాణాయామము చేయువారు పప్పులు (పెసరపప్పుగాక), పెరుగు, మత్స్యమాంసాదులు విడువవలయును. క్షీరాజ్యభోజనము, గోధుమాద్యాహారములు హితములు ప్రాణాయామము చేయువారుపద్మాసనమునందుఁగాని సిద్ధాసనమునందుఁగాని లేకఏదయిన స్థిరాసనమునఁగూర్చుండిప్రాణాయామముచేయవలయును పైనిజెప్పిన జాలంధర బంధాదిపూర్వకముగ మొదటిరోజు ప్రాణాయామములు రెండవరోజున పదునయిదు ప్రాణాయామములు క్రమవృద్ధిగా 80వరకుచేయవలయును. శ్రమయుశిరోవేదనకలిగినచో మెల్లమెల్లగా చేయుచు విశ్రాంతితీసుకొనుచు చేయవలెను. గురువుద్వారా నేర్చికొని చేయుటమంచిది. అవశ్యముకూడ. అడవియేనుగును సింహమును మెల్లమెల్లగా వశముచేసికొనునట్లు ఈ ప్రాణమును మెల్లమెల్లగా తొందరపడకుండ వశపఱచు కొనవలెను. అట్లుగానిచో రోగములు అపాయము కలుగును.

## -: సూర్యభేదనము

అంతగా ఎత్తును పల్లమును గానిచోట ఆసనముచేసికొని ఎడమముక్కు రంధ్రముమూసి కుడిముక్కురంధ్రముతో మెల్లమెల్లగా గాలి పీల్చవలెను. మరలపీల్చి మరల మరల మెల్లగా వదలవలెను. దీనిని

సూర్యభేదనమందురు. దీనివల్ల కపాలశుద్ధిఅగును. వాత, క్రిమిదోషము లును పోవును. ఇట్లు ఎనుబదిసార్లు చేయవలెను. ఆహారము తీసికొనక ఉదయము, సాయంత్రము, అర్థరాత్రి, తెల్లవారుఝామున చేయవలయును. ముందుగా మూడు పుడిసెడులు నీళ్ళు త్రాగి చేయవలెను, ఇన్నిసార్లు వీలు కానిచో ఒకటి రెండుసార్లు ఉదయసాయంత్రములందు చేయవచ్చును. లేదా ఒకసారి ఉదయమందు చేయవలెను. ఇట్లు మూడు, నాలుగునెలలు చేసిన నాడీశుద్ధియగును. నాడిశుద్ధికిగుర్తు శరీరము కృశించుట, శరీరము తేలికగుట, కంఠము స్ఫుటముగా నుండుటయునుఅగును. దీనివల్ల కుండలినీ ప్రబోధమగును. వెన్నెముక క్రింద చల్లగానుండుట, చీమపై కిపాకి నటు తోచుట, శిరస్సున జలదరింపును గలుగును. ఇది మొదటిమెట్టు

## ఉజ్జాయి

నోరుమూసుకొని ఎడమ కుడిముక్కురంధ్రములతో గాలినిపీల్చి వదలవలెను. దీనివల్ల కంఠమున శ్లేష్మముపోయి జఠరాగ్ని వర్ధిల్లును. నాడీజలోదరాదులు, ధాతుగతదోషములు పోవును. ఇది నడచుచు నిలచుచు చేయవలయును.

## -: సీత్కారి :-

నోటితో సీత్కారధ్వనితో గాలిపీల్చి పెదవులమధ్య చేర్చిన నాలుకతో గాలినిపూరించి ముక్కుద్వార గాలివదలవలెను ఇట్లుచేసినచో రూపము సుందరమగును. సోమరితనము పోవును ఆకలి దప్పికలు, నిద్రలుతగ్గును. దీనివల్ల సర్వోపద్రవములు పోవును.

## శీతలి

పెదవుల బైటకు పక్షిముక్కువలె చాలుకచాపి గాలినిపీల్చి గాలికొంచెము నిలిపి గాలిని మెల్లమెల్లగా విడువవలెను. దీనివల్ల గుల్మము ప్లీహపైత్య రోగములు పోవును. ఆకలి దప్పికలును తగ్గను.

## భస్త్రిక

పద్మాసనము వేసికొని నడుము, మెడ, వంచక నోరు మూసుకొని ఎడమముక్కుతో గాలి గుండెవరకుపీల్చి కుడిముక్కుతో వదలవలెను కుడిముక్కుతో పీల్చి ఎడమ ముక్కుతో వదలవలెను. కమ్మరివాని తిత్తివలె పూరించివదలవలెను. శ్రమకలుగువరకు కుడి ముక్కుతో గాలిపీల్చి ఎడమ ముక్కుతో వదలవలెను నడిమివ్రేలు చూపుడువ్రేలు విడిచి బొటనవ్రేలు అనామిక చిటికెనవేళ్లతోమూసి వదలుచుండవలెను. ఇట్లు ఎనుబదిసార్లు చేయవలెను. వాతపిత్తశ్లేష్మములను హరించును జఠరాగ్నిని పెంచును. కుండలిని మేల్కొలుపును బ్రహ్మగ్రంధి విష్ణుగ్రంధి రుద్రగ్రంధి అను వానిని భేధించును.

## భ్రామరి

వడిగా శబ్దసహితముగా తుమ్మెదనాదముగలుగునట్లు గాలిపూరించి ఆడు తుమ్మెదనాదముగలుగునట్లు గాలివిడిచిన దీనిని భ్రామరిఅందురు. దీనివల్ల చిత్తమున అపూర్వానందము కలుగును.

## మూర్ఛ

గాలిపీల్చినపిదప జాలంధరబంధము( గడ్డము గుండెపై ఆనించుట) వేసి మెల్లమెల్లగాగాలి విడవవలెను దీనివల్ల మనస్సుకు మత్తునుగూర్చి సుఖము గూర్చును.

## ప్లావిని

దేహమును పొట్టను గాలితో నింపినచో అగాధజలములోగూడ తామరాకువలె సుఖముగతేల్చును. దీనిని ప్లావిని యందురు.

రేచకపూరకములతోఁ గూడిన కుంభకమును సహితకుంభకమందురు. రేచకపూరకములులేని దానిని కేవల కుంభక మందురు. కేవలకుంభకము సిద్ధించువఱకు సహితకుంభకమును అభ్యసించవలయును.

"కుంభకాత్ కుండలీబోధః, కుండలీబోధతో భవేత్, అనర్గళా సుషుమ్నాచ హఠసిద్ధిశ్చ జాయతే" కుంభకమువల్ల కుండలిమేల్కొనును. అది మేల్కొనుటవల్ల సుషుమ్నానాడి అనర్గళముగా ధారించుచున్నను. పై విమెల్ల మెల్లగా ఆచరింపవలెను. హిత మితాహారియై అభ్యసింపవలెను. గురువు ద్వారా అభ్యసించుట ముఖ్యము.

వివ:- "రేచకం పూరకంత్యక్త్వా సుఖం యద్వాయుధారణం ప్రాణాయామోఽయమిత్యుక్తః సవై కేవల కుంభకః కేవలే కుంభకే సిద్ధే రేచక పూరక వర్జితే, న తస్యదుర్లభం కించి త్త్రిషులోకేషు విద్యతే" రేచకమును పూరకమునువిడచి వాయువును ధరించుట కేవల కుంభకమను ప్రాణాయామము. రేచకములులేని కేవల కుంభకము సిద్ధింపంగా ఆతనికి మూండులోకములందు దుర్లభమైనదిలేదు" అని వశిష్ట సంహిత. ఈ కుంభక ప్రాణాయామములో కాల్చినఇనుమీందంజల్లిన నీరుమాయమైనట్లు పీల్చినగాలి లోన మాయమగునని భావము.

## 52. తతః క్షీయతే ప్రకాశావరణమ్

సూ. ఆ ప్రాణాయామమువల్ల వివేక జ్ఞానావరణము క్షీణించును

## 53. ధారణాసు చ యోగ్యతా మనసః

సూ. దానివలన మనస్సునకు ధారణలయందు సామర్థ్యము గలుగును.

వివ:- ధారణలంగూర్చి ముందుముందు చెప్పంబడును.

## 54. స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవే న్ద్రియాణాం ప్రత్యాహారః

సూ. ఇంద్రియములకు స్వస్వవిషయములందు సంనికర్ష లేనపుడు ధ్యానాదులందు చిత్తస్వరూపమును అనుకరించుటవలెనుండునది ప్రత్యాహారము.

వివ:- చిత్తముతోంగూడిన యింద్రియములను నిరోధించుట ప్రత్యాహారము తేనెటీంగలరాణి ఎగిరిన తేనెటీంగలు ఎగురును. నిలిచిన నిలుచును

అట్లే చిత్తము కదలినచో ఇంద్రియములు గదలును, అదికదలనిచో ఇంద్రియములు గదలును. అది కదలనిచో ఇంద్రియములు గద లవుగాన చిత్తమును నిరోధింపఁగా నింద్రియములును నిరోధింపఁ బడునని భావము.

55. తతః పరమా వశ్యతేన్ద్రియాణామ్

సూ. ఆ ప్రత్యాహారమువల్ల నింద్రియములను బూర్తిగా జయించుట సిద్ధించును.

భా: శబ్దాదులందు వ్యసనములేకుండుట యింద్రియ జయమని కొందఱు విరుద్ధముగాని విషయముల సేవించుట యింద్రియజయమని మఱి కొందఱు శబ్దాదులందు భోగ్యాధీనుఁడై కాక స్వాధీనుఁడై యుండుట ఇంద్రియ జయమని మఱికొందఱు. రాగద్వేషములు లేకుండ సుఖ దుఃఖములను విడచిన శబ్దాదిజ్ఞానము ఇంద్రియజయమని కొందఱు ఏకాగ్రతను బొందిన మనస్సు విషయములను బొందకపోవుటయే ఇంద్రియజయమని జైగీషవ్యుఁడు. ఈయోగము యమనియమాదు లచే బీజము వేయఁబడి ఆసనప్రాణాయామాదులచే మొలకెత్తి ప్రత్యా హారముచేఁ బుష్పించి ధ్యానధారణ సమాధులచే ఫలించుననని తెలియునది.

ఇది

పతంజలిచే రచింపఁబడి చన్న గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన యోగతత్త్వ దర్శనమందు సాధన పాదము.

— ౨ —

# 3 విభూతిపాదము

## 1. దేశబంధ శ్చిత్తస్య ధారణా

సూ. హృదయ పద్మాది ప్రదేశమందు ధ్యేయమునుగూర్చిన చిత్తైకాగ్రతధారణ యనఁబడును.

వివ:- ఆదిపదముచే నాభిచక్రము, మూర్ధము, నాశికాగ్ర జిహ్వాగ్రము లను బాహ్యవిషయములును గ్రాహ్యము. ఈ పాదమందు సమాధికి అనుగుణమైనవియు శ్రద్ధగలుగుటకు హేతువైనవియు నగు విభూతులు చెప్పఁబడును. అవి సంయమసాధ్యములు, సంయమ మనఁగా ధారణా ధ్యాన సమాధి సముదాయము. అందుచేధారణాదులనుగూర్చి ముందుగాఁ జెప్పఁబడుచున్నది.

## 2. తత్ర ప్రత్యయైక తానతా ధ్యానమ్

సూ. హృదయదేశమందు ధ్యేయకారమైన వృత్తి ప్రవాహము ధ్యానము.

## 3. తదేవార్థమాత్ర నిర్భాసంస్వరూప శూన్య మివ సమాధి:

సూ. ధ్యేయవస్తువు మాత్రమే ప్రకాశించి స్వరూపములేని దానివలెనుండు నాధ్యానమే సమాధి.

వివ:- "సమ్యక్ అధీయతే ఏకాగ్రీక్రియతే విక్షేపాన్ పరిహృత్య మనః" విక్షేపములను పరిహరించి మనస్సు బాగుగా ఇందు ఏకాగ్రము చేయఁబడును" అని వ్యుత్పత్తి. ధ్యానించువాఁడు ధ్యానించుట ధ్యానింపదగిన వస్తువు అను విభాగము లేక ధ్యేయముమాత్రమే ప్రకాశించునది సమాధి అనిభావము.

## 4. తత్త్రియ మేకత్ర సంయమః

సూ. ధ్యానధారణా సమాధులను ఒక విషయమునందు నిలుపుట సంయమ మన బడును.

## 5. తజ్జయా త్ప్రజ్ఞా లోకః

సూ. అసంయమము యొక్క స్థైర్యము వల్ల సమాధిప్రజ్ఞ దీప్తించును.

## 6. తస్య భూమిషు వినియోగః

సూ. స్థూల స్థూల రూపములనుండి సూక్ష్మసూక్ష్మ రూపములందు క్రమముగా అసంయమమును, వినియోగింపవలెను.

వివ:- సాయుధ సభూషణ చతుర్భుజాది దైవస్వరూపమందు సమాధి సిద్ధించినపిదప సాయుధాది స్వరూపరహిత సమాధియును దాని పిదప అతఁడే నేననియు పిదప "నేనే" అనియు యోగి క్రమముగాఁ దెలిసికొనవలయును, యోగావస్థల క్రమాభివృద్ధియు తెలియఁదగును, శ్లో॥ యోగేన యోగో జ్ఞాతవ్యోయోగో యోగాత్ప్రవర్తతే యోఽప్రమత్తస్తుయోగేన స యోగే రమతే చిరమ్," "యోగసాధనలో ఒకటి సిద్ధించినపిదప నింకొకటిసాధన చేయువలయును, యోగసాధనాలక్షణములనుబట్టి ఆయాయోగములు సిద్ధించినట్లు గ్రహించి యుత్తరోత్తర యోగసాధనల చేయువలయును,
అప్రమత్తుఁడై చేయువాఁడు యోగమందు రమించును. ఏమాత్రము పొరపడినను యోగము సిద్ధింపదు సరిగదా రోగాలు గలుగును.

## 7. త్రయ మన్తరంగం పూర్వేభ్యః

సూ. ఇదివఱకుఁ జెప్పఁబడిన యమాది పంచకముకంటెఈ మూఁడును సంప్రజ్ఞాత యోగమున కావశ్యములు.

8. తదపి బహిరంగం నిర్బీజస్య

సూ. మిగిలిన మూఁడునుగూడ అసంప్రజ్ఞాతమున కనావశ్యకములు.

9. వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభిభవ ప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధ పరిణామః

సూ. వ్యుత్థాన సంస్కారమున, క్షీణించుట, నిరోధసంస్కారము వృద్ధిచెందుట నిరోధపరిణామ మగును, అదియును నిరోధకాలమందలి చిత్తముతోఁ గలిసి ఏకమై యుండును.

వివ:- వ్యుత్థానసంస్కారము=సమాధ్యవస్థనుండి లేచునప్పటి సంస్కారము నిరోధసంస్కారము = సమాధ్యవస్థయందు వృత్తులను నిరోధించునప్పటి సంస్కారము.

10 తస్య ప్రశాన్తవా హితా సంస్కారాత్

సూ. ఆ నిరోధము స్వసంస్కారమువల్ల ప్రశాంత ప్రవాహ రూపముఁ పొందును. సర్వవిషయ వాసనలు నశించుటయు ఏకాగ్రత్వముదయించుటయు, చిత్తముయొక్క సమాధిపరిణామము.

11. సర్వార్థ తైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః

సూ. పిదప మరల అనాళోదయములు ఒకరూపమునే పొందుట చిత్తముయొక్క యేకాగ్రతా కాలమందలి పరిణామము.

12. తతః పునః శాన్తోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః

సూ. దీనిచేత భూతములందును, ఇంద్రియములందునుగల ధర్మలక్షణావస్థల పరిణామములు తెలియఁబడినవి.

13. ఏతేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థాపరిణామాః వ్యాఖ్యాంతాః

వివ:- చిత్తైకాగ్రతయొక్క పరిణామమునుబట్టియే భూతములయొక్కయు నింద్రియములయొక్కయు ఆయాపరిణామములు గలుగునుగాన దానిలోనే యివి యంతర్భవించును.

అవి వేఱుగఁ జెప్పనవసరములేదని భావము ధర్మికి ధర్మముచే పరిణామము :- మట్టిముద్దరూపమయిన ధర్మముపోయి కుండరూపమయిన ధర్మము గలుగుట. ధర్మమునకు లక్షణములచే పరిణామము:- మట్టిముద్దకు ఇప్పటి లక్షణములు పోయి ఇదివరకున్న లక్షణములు గలుగుట, లక్షణములకు అవస్థలచే పరిణామము:-ఇప్పటి లక్షణములుగల కుండ మొదలగునవి క్రొత్త, పాత, పెద్ద, చిన్న అవస్థలను బొందుట ఇట్లే ఇంద్రియములకుఁగూడ తత్త్వద్రవ్యాదాలోచనము ధర్మమును బట్టిగలిగిన పరిణామము, ఆ యింద్రియములకేవర్తమాన త్వాదులు లక్షణములచే గలిగిన పరిణామము. సానికేరత్వాద్యాలోచనముయొక్క స్ఫుటత్వాస్ఫుటత్వాదులుఅవస్థలచేఁ గలిగిన పరిణామముధర్మాదులనుబట్టి పరిణామమేగాని వాస్తవమునకు మట్టి మొదలగుద్రవ్యములు మారవని తెలియునది.

14. శాన్తోదితావ్యపదేశ్యధర్మానుపాతీ ధర్మీ

సూ. భూతవర్తమాన భవిష్యత్కాల ధర్మములందువర్తమాన రూపముగా ననుగతమైనది ధర్మి యగును.

వివ:- ధర్మములకంటె ధర్మి వేఱుగా నుండదనువారి మతమునకిది ఖండనము మట్టి మొదలగువానియందు వర్తమానకాలములో ఘటాది రూపముగా నున్నది ధర్మియని భావము.

15. క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః

సూ. క్రమములయొక్క భేదమువలన వస్తువులమార్పులు వేఱువేఱుగా నుండును.

వివ:- మట్టి మొదట చూర్ణముగా నుండి ముద్దగామాఱుట యొక క్రమము, పిదప ముద్దరూపమును విడిచి కుండయగుట మఱియొక క్రమము, అదియు విడిచి ముక్కలగుట యింకొక క్రమము. ఇట్లే బాల్య యౌవన వార్ధక్యములలో అవస్థలమార్పు క్రమముగా నగుచున్నది.

## 16. పరిణామ త్రయ సంయమా దతీతానాగత జ్ఞానం

సూ. ఆ ధర్మలక్షణావస్థలవల్లఁ గలుగు పరిణామములందు సంయమము వలన భూతభవిష్యత్కాలజ్ఞానము గలుగును.

వివ:- ధ్యానధారణాసమాధులచేత సాక్షాత్కారము చేసికొనుటయే ఇక్కడ సంయమపదమున కర్థము. ఈ సంయమముచే పరిణామత్రయము సాక్షాత్కరింపఁబడినదై పరిణామవిక్షేపములు పోయిన చిత్తమందు అతీతానాగతజ్ఞానము గలుగును. మఱిరిపోయిన యద్దమందు వలె చిత్తమందు అతీతానాగత జ్ఞానములు సాక్షాత్కరించునని భావము.

## 17. శబ్దార్థ ప్రత్యయానా మితరేత రాధ్యా సాత్సంక రస్తత్ప్ర విభాగసంయమా త్సర్వ భూత రుతజ్ఞానమ్

సూ. గవాది శబ్దములను దగవాద్యర్థములను గవాదిజ్ఞానములను విడివిడిగా నొక్కొక దానియందు నొక్కొక దానిని మిథ్యగాఁ దెలిసికొనుటవలన జ్ఞానసాంకర్యము గలుగును. అట్లుగాక తత్త్వవిభాగములను సంయమము చేయుటవలన సర్వప్రాణి రుతజ్ఞానము గలుగును.

వివ:- గోవు, గమనము, గౌరము, గానము, నగము మొదలగువానియం దున్న గకారము యనే జార్థములను దెలుపుచున్నది ఇట్లే ఓంకారము సోముండు, వ్యోమము, భోగము మొదలగు వానియందుండి యనే కార్థములను దెలుపుచున్నది. దీనిని బట్టి వర్ణములు సర్వార్థద్యోత కములుగా నున్నవన్నమాట. ఇట్లే పదములును సర్వవాక్యార్థాభి

ధాన శక్తిగలవి. మఱి గోవు అనుచోట గో అను శబ్దమును ఆవు అను అర్థమును గంగడోలుగలజంతువు అనుజ్ఞానము గోపదమునకేగలుగుచున్నది. ఇట్లుగకారము ఓకారసాహాయ్యముచే గోపదము స్ఫోటరూపముగా అవు అనుదాని యందుసంకేతముచే వ్యవస్థాపింత బడుచున్నది. ఇట్లే యాయా పదములు ఆయావర్ణముల క్రమవిశేషము పొంది సంకేతముచే వ్యవస్థాపింప బడుచున్నవి. ఈ సంకేతము కృత్రిమము. మనుజుఁడు తనకు మొదటినుండి యలవాటయిన పదములయొక్క యాయావర్ణముల పూర్వాపర సన్నివేశవిశేషములచే సంచేతింపఁబడిన శబ్దార్థజ్ఞానముల గ్రహింపఁగలుగుచున్నాఁడు ఒకదానియందొకటి భ్రాంతిచే శబ్దార్థజ్ఞానములందు సాంకర్యము గలుగుచున్నది. ఇట్టి వర్ణపద వాక్యములకు మూలమైన భావము నాదము ఒకటే యయినను తత్తాత్త్వతి సంకేతములచే వేఱువేఱుగా గ్రహింపఁబడి సంకరములగుచున్నది. ఈ సంకేతము అనాదిగా వచ్చు వాగ్వ్యవహారమునకు సంబంధించిన లోకమునకుఁ బ్రతీయమానముమగుచు భిన్నభిన్న భాషలలోను, రుతములలోను, వేఱువేఱయి సంకీర్ణమగుచున్నది. మఱి యట్లుగాక యా అనాది సంకేతమునకు నాదమందున్న విభాగములను ధ్యానధారణాసమాధులచే సంయమము చేసికొనుటవలన అనాదిగావచ్చు కృత్రిమ సంకేతములచే సిద్ధించిన తత్తద్వ్యక్త పదవాక్య విశేషములనుగాక అనాది సంకేతములకు మూలమయిన నాదస్వరూపమును తద్గతభావమును అర్థమగును గాన దానినిబట్టి సర్వప్రాణుల రుతముల జ్ఞానము యోగికి సులభ మగునని భావము.

## 8. సంస్కారసాక్షాత్కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్

సూ. సంస్కారములందు సంయమముచే సంస్కారములను సాక్షాత్కారము చేసికొనుట వలనఁ బూర్వజన్మజ్ఞానము గలుగును.

వివ:- స్మృతికి అవిద్యాది క్లేశములకు హేతువులయిన పూర్వవాసనలును, జాతికి ఆయువునకు భోగమునకు హేతువులయిన పూర్వ ధర్మాధర్మములను సంస్కారములనఁబటును. వానియందు సంయమము

చేసికొనుటవలనఁ బూర్వజన్మజ్ఞానము యోగికిఁగలుగునని భావము దేశకాల నిమిత్తానుభవములు లేకుండ అవి సాక్షాత్కరింపఁబడవు. ఇట్లే భావిజన్మల జ్ఞానము గలుగునని భావము.

ఈ విషయములో ఒకయాఖ్యానము వినబడుచున్నది. పూజ్యుఁడయిన జైగీషవ్యునికి సంస్కారాలు సాక్షాత్కారమగుటవలన పది మహాసర్గములందు జన్మపరిణామక్రమమును చూచుటచే వివేకజ్ఞానము ప్రాదుర్భవమయ్యెను. అపుడు పూజ్యుఁడయిన ఆవట్యుఁడు శరీరముసుదాల్చి యాజైగీషవ్యుని నిట్లడిగెను. "పది మహాసర్గములందును విగళిత రజస్తమో దోషుఁడవయి యుండుటవలనఁ దిరస్కరింపఁబడని బుద్ధిసత్త్వముగల నీవు—నరకతిర్యగ్గర్భములలో మాటిమాటికిఁ బుట్టిననీవు—సుఖదుఃఖడూలలో నేది యధికముగాఁ గనుచుంటివి?" అని. అపుడు పూజ్యుఁడయిన యావట్యునితో జైగీషవ్యుఁ డిట్లనియెను. "పది మహాసర్గములందు విగళితరజస్తమోదోషుఁడనయి యుండుటవలన తిరస్కరింపఁబడని బుద్ధిసత్త్వముగల నేను దేవమనుష్యులలో మాటిమాటికిఁబుట్టిన నేను—అనుభవించినదంతయు దుఃఖమేయని తెలివికొనుచున్నాను" అని అపుడు పూజ్యుఁడయిన యావట్యుఁడనియె. "ఆయుష్మంతుఁడవయిన నీవు ఈ ప్రధానమైన జితేంద్రియత్వమును అత్యంతోత్తమమైన సంతోషసుఖమును దుఃఖముగా నేలచెప్పుచుంటివి" అని. అపుడు పూజ్యుఁడయిన జైగీషవ్యుడనెను. "విషయసుఖాలను బట్టి ఇది యత్యంతోత్తమమైన సంతోషసుఖముగాఁ జెప్పఁబడినదే గాని మోక్షమును బట్టి చూచినచో నిది దుఃఖమే. ఆశాపాశమె దుఃఖము" అని

## 19. ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్

సూ. రాగద్వేషాదులుగల తన చిత్తవృత్తియొక్క సంయమమువలనఁ బరచిత్తజ్ఞానము గలుగును.

వివ:- పరుని చిత్తము దేనియందు లగ్నమైనదో అది యోగి చిత్తమునకు విషయము గాకపోవుటవలనఁ బరచిత్తజ్ఞానమెగాని పరచిత్తము లగ్నమయిన దానిని యోగిచిత్తము తేలిసికొనదు.

2[illegible]. కాయరూప సంయమాత్తద్గ్రాహ్యశక్తి స్తంభే చక్షుః ప్రకాశాఽసంప్రయోగే అంతర్ధానమ్

సూ. శరీరముయొక్క రూపమును సంయమము చేయుటవలన దానిని గ్రహించు దృశ్యత్వశక్తియును స్తంభింపఁబడఁగా చక్షుః సంయోగము గలుగుదు. అపుడు అంతర్ధానము గలుగును.

వివ:- ఇట్లే శబ్దాదుల యంతర్ధానము సంగతియుఁ దెలియవలెను.

21. సోపక్రమం నిరుపక్రమంచ కర్మ తత్సంయమా దపరాన్త జ్ఞాన మరిష్టేభ్యోవా

సూ. సోపక్రమము నిరుపక్రమము అను రెండు విధములయిన కర్మలను సంయమము చేయుటవలనఁగాని అరిష్టములవలనఁగాని మరణ జ్ఞానము గలుగును

వివ:- జాత్యాయుర్భోగములను గూర్చు కర్మ సోపక్రమము (=త్వరగా ఫలించునది) నిరుపక్రమము (=అలస్యముగా ఫలించునది) అని రెండు. ఎండలో విప్పి ఆఱవేసినబట్ట త్వరగా ఆఱునట్లు త్వరగా ఫలించునది సోపక్రమము, ముద్దగాఁబెట్టి నీడనుంచినబట్ట ఆలస్యముగా ఆరునట్లు అలస్యముగా ఫలించునది నిరుపక్రమము. అటువంటి కర్మల వల్లను మరణజ్ఞానము తెలియును. అరిష్టములు=అరి అనఁగా శత్రువులవలె త్రాసమును గూర్చునవిగాన అరిష్టములు. చెవులు మూసి

కొన్నపుడు లోన ధ్వని వినిపింపకపోవుట, అరుంధతిని సూర్యాది జ్యోతిస్సులను జూడలేకపోవుట, యమదూతలను జూచుట, చని పోయిన పితరులను జూచుట, భూమిని స్వర్గమునుగాను మనుష్యులను సిద్ధులనుగాఁనిచూచుట అపశకునములు ఇవియరిష్టములు వీని వలనను మరణజ్ఞానము గలుగునని భావము.

## 22. మైత్ర్యాదిషు బలాని

సూ. సుఖవంతులయందు మైత్రిని, దుఃఖవంతులయందుఁ గరుణను పుణ్యవంతులయందుఁ బ్రీతిని, భావించి సంయమము చేయుటవలన అమోఘమైన మైత్రీబలాదులను బొందును.

వివః- ఇందువలన లోకోద్ధరణాది కార్యములందు సఫలుఁడగునని భావము

## 23. బలేషు హస్తిబలాదీని

సూ. హస్త్యాది బలములందు సంయమమువలన హస్త్యాదుల బలములు గలుగును.

## 24. ప్రవృత్త్యాలోకన్యాసాత్ సూక్ష్మ వ్యవహితవిప్రకృష్ట జ్ఞానమ్

సూ. చిత్తప్రవృత్తి ప్రకాశించునప్పటి సత్త్వప్రకాశము సూక్ష్మాదివస్తువు లందుంచుటవలన సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట జ్ఞానముగలుగును.

వివః- ఈ చిత్తప్రవృత్తి ప్రకాశించునప్పటి సత్త్వప్రకాశము గూర్చి మొదటి సమాధిపాదమునఁ జెప్పఁబడినది. దేశకాల వ్యవహితము= దేశకాలములచే వ్యవధానమైనది. భూమిలోనినిధి నిక్షేపాదుల జ్ఞానము. విప్రకృష్ట దూరమునందున్నది. మేరుపర్వతాదుల దగ్గఱ నున్న రసాయనాదుల జ్ఞానము.

## 25. భువనజ్ఞానం సూర్యే సంయమాత్

సూ. సూర్యమండలమునందు సంయమము చేయుటవలన సర్వభువన జ్ఞానము గలుగును.

వివ:- సర్వభువనమును గూర్చి వ్యాసభాష్యమున ఈ క్రింది విధముగ వివరింప బడెను.

సప్తలోకములు :- 1. భూర్లోకము, 2. అంతరిక్షలోకము (భువర్లోకము) 3. మాహేంద్రము, (సువర్లోకము) 4. మహర్లోకము, 5, జనోలోకము 6. తపోలోకము, 7. సత్యలోకము.

1. అవీచి యనునిన్న తమమైన నరకము మొదలుకొని మేరునవృష్ఠము వఱకుండునది భూర్లోకము.

2 మేరు వృష్ఠము మొదలుకొని ధ్రువనక్షత్రమువఱకు గ్రహనక్షత్ర తారా విచిత్రమైనది. అంతరిక్షలోకము.

దానిపై నిగల స్వర్లోకము అయిదువిధములు. 1 మాహేంద్రము 2. మహర్లోకము ఇది ప్రజాపతికి సంబంధించినది 3 జనోలోకము 4 తపోలోకము 5 సత్య లోకము ఈ జనస్తపస్సత్యలోకములను బ్రహ్మలోకము లందురు.

అవీచికి పైపైని ఆఱు నరకములు కలవు

| | | |
|---|---|---|
| 1. | పృథివీసంఘాత రూపమైనది | మహాకాలము |
| 2. | సలిలసంఘాత రూపమైనది | అంబరీషము |
| 3. | అగ్ని రూపమైనది | రౌరవము |
| 4. | వాయు రూపమైనది | మహారౌరవము |
| 5. | ఆకాశ రూపమైనది | కాలసూత్రము |
| 6. | తమోరూపమైనది | అంధతామిస్రము |

వీనియందు తమ తమ కర్మల ననుసరించి ప్రాణులు దీర్ఘకాలము ఆయువును గ్రహించి కష్ట మనుభవింతురు. వాని పిదప 1 మహాతల 2. రసాతల, 3. అతల, 4. సుతల, 5. వితల, 6. తలాతల, 7. పాతాళములు అను ఏడు పాతాళములు గలవు.

సప్తద్వీపములు గల భూమి ఎనిమిదవది. ఆ భూమికి మధ్యను మేరు వను బంగరు కొండగలదు. దానికి 1. రాజత 2. వైడూర్య 3. స్ఫటిక 4 హేమ 5. మణి మయములైన శృంగములుగలవు. అకాశపు దక్షిణ భాగము వైడూర్యప్రభావ్యాప్తమగుటవలన నీలోత్పలపత్రశ్యామలమై యుండును. తూర్పుభాగము రజతప్రభావ్యాప్తమగుటవలన శ్వేతమై యుండును. పశ్చిమభాగము స్ఫటిక ప్రభావ్యాప్తమై యుండుటవలన స్వచ్ఛమై యుండును. ఉత్తరభాగము హేమ ప్రభావ్యాప్తముఅగుట వల్ల సువర్ణపుష్పమువలె నుండును. దీనికి దక్షిణపార్శ్వమందు జంబూ వృక్షముగలదు. దీనిబట్టియే జంబూ ద్వీపమని దీనికిపేరు గల్గినది. అందు సూర్యుడు సంచరించుటవలన రాత్రింబవళ్ళు కలిసినట్లు తిరుగు చుండును. ఆ మేరువున కుత్తరదిక్కున నీలము, శ్వేతము, శృంగ వంతము అను మూడు పర్వతములు గలవు. అవి యొక్కొక్కటి రెండు వేల యోజనములు విస్తారము గలిగి యున్నవి. వానిమధ్య యొక్కొక్కటి తొమ్మిదివేల యోజనములు విస్తారముగల మూడు వర్షములు గలవు. 1 రమణకవర్షము, ఇది నీలగిరి కుత్తరముగా నున్నది. 2. హిరణ్మయ వర్షము, ఇది శ్వేతగిరి కుత్తరముగా నున్నది. 3. ఉత్తరకురువర్షము ఇది శృంగవంతమున కుత్తరముగా సముద్రముపటకు నున్నది. ఇట్లే దక్షిణభాగమున ఒక్కొక్కటి రెండువేల యోజనములు విస్తారముగల 1. నిషధపర్వతము. 2. హేమకూటపర్వతము 3. హిమశైలము అను పర్వతములు గలవు. వానిమధ్య ఒక్కొక్కటి తొమ్మిదివేల యోజనములు విస్తారముగల 1. హరివర్షము 2. కింపురుషవర్షము 3. భారతవర్షము అను మూడువర్షములు గలవు. సుమేరువునకు ప్రాచీనముగ మాల్య వత్పర్వతము హద్దువరకు భద్రాశ్వములను పేరుగలవి 40 వేలయోజన ములుగలవి. ఇది భద్రాశ్వవర్షము 1. ప్రతీచీనము గంధమాదనముగా

హద్రుపటుకు కేతుమాలము అను పేరుగల వర్షములు 40 వేల యోజనములు గలవి. ఇది కేతుమాలవర్షము 2. విని మధ్యదేశ ఇలావృత వర్షము 3. ఇది మొత్తము నూరువేల యోజనములు విస్తారముగలది. ఇట్లు జంబూద్వీపములో తొమ్మిదివర్షములు గలవు. ఆ జంబూద్వీపము నూఱువేల యోజనములు విస్తారముగలది. దానికంటె రెట్టింపైన లవణ సముద్రముచేత అది వలయాకారముగా చుట్టఁబడియున్నది. పిదప శాక, కుశ, క్రౌంచ, శాల్మలి, మగధ, పుష్కరద్వీపములు గలవు. జంబూద్వీపముకన్న శాకద్వీపము రెట్టింపు, అనఁగా రెండువేలయోజనములు శాకద్వీపము కన్న కుశద్వీపము రెట్టింపు. అనగా నాలుగువేల యోజనములు. ఇట్లే మిగిలినవి. అనఁగా క్రౌంచము ఎనిమిదివేల యోజనములు పుష్కరద్వీపము ముప్పది రెండువేల యోజనములు, వానిచుట్టు వలయాకారముగ ఆవాలరాసులవలె తీరములందున్న విచిత్ర శైలములచే నలంకరింపఁబడిన ఇక్షురస, సురా, సర్పి, దధి, మండ, క్షీర, స్వాదువు అను సప్తసముద్రములు ఇక్షురసాది తుల్యోదకములై లోకాలోకపర్వత పరివారములై యున్నవి. అవి యన్నియుఁ గలిపి ఏఁబది యోజనముల విస్తారముగలవి. ఇది యంతయు బ్రహ్మాండమధ్యమందు సుప్రతిష్ఠితసంస్థానమై సంక్షిప్తమై యున్నది. ఈ బ్రహ్మాండముగూడ ఆకాశములోని మిణుఁగురుపురువువలె ప్రకృతిలో అణువంత పరిమాణమైనది. అందు పాతాళమున, జలధిలో, పర్వతములలో, దేవయోనులైన అసుర, గంధర్వ, కిన్నర, కింపురుష, యక్ష, రాక్షస, భూత, ప్రేత పిశాచ, అపస్మారక, అప్సరో, బ్రహ్మరాక్షస, కూష్మాండ, వినాయకు లను వారు నివసింతురు.

1. భూర్లోకము :- సర్వద్వీపములందు పుణ్యాత్ములైన దేవులు మనుష్యులును నివసింతురు. సుమేరువు త్రిదశుల కుద్యానభూమి. అందు మిశ్రవనము, నందనము, చైత్రరథము, సుమానసము అనునవి యుద్యానములు, సుదర్మ అనునది దేవసభ, సుదర్శనము పట్టణము, వైజయంత మనునది రాజసౌధము,

2. భువర్లోకము -: గ్రహ, నక్షత్ర, తారకలు, ధ్రువనక్షత్రమున నిబద్ధములై వాయు విక్షేపముచే ప్రతి నియమితమైన గమనప్రచారము గలవై సుమేరువునకు పై పైనున్నవై తిరుగుచుండును.

3. సువర్లోకము -: మహేంద్ర నివాసులైన, దేవయోనులు ఆఱు విధములుగనుందురు 1 త్రిదశులు, 2 అగ్నిష్వాత్తులు, 3 యామ్యులు 4 తుషితులు, 5 అపరనిర్మితవశవర్తులు, 6 పరినిర్మిత వశవర్తులు అని యీ యాఱుగురు దేవయోనులు వీరందఱు సంకల్పసిద్ధులు, అణిమాద్యైశ్వర్యయుక్తులు, కల్పాయుష్కులు (కల్పము=బ్రహ్మదినము) దేవులు, కామభోగులు, పితృసంయోగములేకయే క్షణములోనే శరీరమును పుట్టింపఁ గలవారు ఉత్తమానుకూలాప్సరస స్త్రీలచే నావరింపఁబడినవారై యుందురు

3 మహర్లోకము :- ఇందు దేవయోనులు 1 కుముదులు, 2 ఋభువులు, 3 ప్రత్యర్దనులు, 4 అంజనాభులు, 5 ప్రచితాభులు అని అయిదు విధములుగ నుందురు మహాభూతములను వశమందుంచఁగలవారు, ధ్యానాహారులు అనఁగా ధ్యానము చేతనే తృప్తి పొందువారు కల్పసహస్రాయుష్కులు

5 జనోలోకము :- బ్రహ్మ యొక్క జనోలోకమున దేవయోనులు 1 బ్రహ్మపురోహితులు, 2 బ్రహ్మకాయికులు, 3 బ్రహ్మమహాకాయికులు 4 అమరులు అను నలుగురు గలరు వీరందఱు భూతేంద్రియములను వశమందుంచుకొనఁగలరు

6 తపోలోకము :- ఇందు దేవయోనులు 1 భాస్వరులు, 2 మహాభాస్వరులు, 3 సత్యమహాభాస్వరులు అను మువ్వురుగలరు వీరందరు భూతేంద్రియ ప్రకృతులను వశమందుంచుకొనఁగలవారు. రెండురెట్లు మూడురెట్లు ఎక్కువ అయువుగలవారై, అందఱు ధ్యానాహారులయి ఊర్ధ్వరేతసులయి, పైకి అడ్డగింపటడని జ్ఞానము గలవారయి, క్రింది భూములంఁదావరింపబడని జ్ఞానముగలవారయి యుందురు.

7. సత్యలోకమున:- ఇందు దేవయోనులు 1. అచ్యుతులు 2. శుద్ధ నివాసులు, 3. సత్యాభులు, 4. సంజ్ఞాసంజ్ఞులు అను నల్వురు గలరు వీరందఱు గృహనిర్మాణములేని యనికేతులు. ఆత్మగృహమందుం డువారు పై పైనుందురు ప్రకృతిని వశమందుంచగలవారు. సృష్టి యున్నంతవఱకు ఆయువు గలవారు. అందులో అచ్యుతులు సవి తర్క, ధ్యానసఖులు, శుద్ధనివాసులు, సవిచార ధ్యానసుఖులు, సత్యాభులు ఆనందమాత్ర ధ్యానసఖులు, వీరందఱును మూఁడులోక ముల మధ్యనుందురు. సప్తలోకములివి.
విదేహులును ప్రకృతిలయులునునగు అసంప్రజ్ఞాత యోగసుఖులు మాత్రము మోక్షమందేగాని పై లోకములందుండరు. సూర్యద్వార మున సంయమముచేసి యిదియంతయు యోగి సాక్షాత్కరింపజేసి కొనునని భావము.

## 26. చంద్రే తారావ్యూహ జ్ఞానమ్

సూ. చంద్రమండల విషయమైన సంయమమువలన నక్షత్రమండల జ్ఞానము గలుగును.

## 27. ధ్రువే తద్గతి జ్ఞానమ్

సూ. ధ్రువవిషయక సంయమమువలన నక్షత్రగతి జ్ఞానము గలుగును.

## 28. నాభిచక్రే కాయవ్యూహ జ్ఞానమ్

సూ. నాభిచక్ర విషయక సంయమమువలన శరీరమందున్న వాత, పిత్త చర్మ, రక్తాది పదార్థముల జ్ఞానము గలుగును.

## 29. కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః

సూ. హృదయమువఱకు నుండు కంఠకూపమును గూర్చిన సంయమము వలన క్షుత్పిపాసలడఁపు.

వివ:- నాలుక క్రిందిభాగము తంతువు. దానిక్రిందిది కంఠము. దాని క్రిందిది కూపము.

**30. కూర్మనాడ్యాం స్థైర్యం**

సూ. కూర్మాకారమైన హృదయ నాడిని గూర్చిన సంయమను వలన స్థిరస్థానము గలుగును.

వివ:- కంఠకూపము క్రింద వక్షఃస్థలమున కూర్మనాడి గలదు.

**31. మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్**

సూ. శిరః కపాలములోని రంధ్రమునందలి సుషుమ్నా నాడియందున్న జ్యోతిస్సునందు సంయమమువల్ల సిద్ధులు కనిపింతురు.

వివ:- సిద్ధులు ద్యాయాపృథువుల మధ్యభాగమున సంచరించు వారుగ నుందురు.

**32. ప్రాతిభాద్వా సర్వమ్**

సూ. ప్రతిభాజన్యమగు జ్ఞానమువలన రయినను సర్వశక్తులు గలుగును.

**33. హృదయే చిత్త సంవిత్**

సూ. హృదయమందున్న దహరహృదయపద్మమున సంయమమువలన చిత్త సాక్షాత్కారమగును.

**34. సత్త్వపురుషయో రత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయా విశేషో భోగః పరార్థత్వా త్స్వార్థసంయమా త్పురుషజ్ఞానం**

సూ. అత్యంత విధర్ములగు సత్వగుణపురుషుల యభేదజ్ఞానము భోగము ఆ సత్త్వము పదార్థమగుటవలన దానికంటె భిన్నమైన స్వార్థము యొక్క సంయమమువలన పురుష(దైవ)సాక్షాత్కారము గలుగును.

వివ:- సంయమమునకు ఫలముగా నింతవఱకు క్షుద్రసిద్ధులు చెప్పఁబడినవి ఇంక నీ సూత్రములో సంయమమునకు ముఖ్యమగు నాత్మ

సాక్షాత్కారము చెప్పఁబడుచున్నది. పురుషుడు=పరమాత్మ. "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" ఓసీ విజ్ఞాతను ఇంకదేనిచేఁ తెలియవచ్చును అని శ్రుతి

35. తతః ప్రాతిభ శ్రావణ వేదనాదర్శాస్వాద వార్తా జాయంతే

సూ. పురుష సాక్షాత్కారమువలన ప్రాతిభ, శ్రావణ, వేద,నాద, ర్శాస్వాద, వార్త శక్తులు గలుగును.

వివ:- ఉపదేశాదులు లేకుండఁగనే సూక్ష్మవ్యవహిత విప్రకృష్టాతీతానాగతములందు మనస్సునకు యథార్థజ్ఞానము ప్రాతిభము. అట్టి శ్రోత్రజ్ఞానశక్తియగు దివ్యశబ్దశ్రవణము శ్రావణమని, త్వక్కు అనఁగా చర్మము దాని జ్ఞానమగు దివ్యస్పర్శ వేదనమని, చాక్షుషజ్ఞానమగు దివ్యరూపజ్ఞానము ఆదర్శమని, రసనా జ్ఞానమగు దివ్యరసజ్ఞానము, ఆస్వాదమని, ఘ్రాణ జ్ఞానమగు దివ్యగంధజ్ఞానము వార్త అని చెప్పఁబడును.

36. తే సమాధా వుపసర్గా వ్యుత్థానే సిద్ధయః

సూ. అవి సమాధికి విఘ్నకారులు. వ్యుత్థానము పొందినవానికి అనఁగా సంప్రజ్ఞాత సమాధి గలవానికి సమాధినుండి లేచినవానికి అవియే పురుషార్థములు.

వివ:- ప్రాతిభాది సిద్ధులను పొంది యవే పురుషార్థములని నమ్మి కృతార్థుండనైతినని ఆత్మజ్ఞానమునుండి విరమించుట తటస్థించును గాన అవి సమాధికి విఘ్నకారులని చెప్పఁబడెను.

37. బంధకారణ శైథిల్యా త్ప్రచార సంవేదనాచ్చ చిత్తస్య పర శరీ రావేశః

సూ. బంధకారణములు శిథిలమగుటవలనను శరీరమందు చిత్తము ఈ నాడిద్వారా ఈ విధముగాఁ ప్రవేశించుననను యోగజ ధర్మజ్ఞానము గరుగుట వలనను పరకాయ ప్రవేశము సిద్ధించును.

వివ:- చంచలముగానున్న చిత్తము కర్మాశయమువల్ల ఒకశరీరమంటె బద్ధమయి యుండుట బంధము బంధనకారణము నశింపఁగా యోగ జ్ఞానమువల్ల యోగి తన శరీరమునుండి చిత్తమునుదీసి పరశరీరము అందు ప్రవేశపెట్టును. సమాధివలననే ఇతరశరీరముకుఁ బ్రవేశించుట యోగికిఁ దెలియును. అపుడు తేనెటీఁగలరాణిని తేనెటీఁగలువలె ఆ చిత్తమును ఇంద్రియములు అనుసరించును.

38. ఉదాన జ్జయా జ్జల పంకకంటకాది ష్వసంగ ఉత్క్రాన్తిశ్చ

సూ. ఉదాన వాయుజయమువల్ల జలపంక కంటకాదుల బాధగలుగదు. స్వేచ్ఛామృతి గలుగును.

వివ:- ఉదానవాయువు=నాసికమొదలు శిరస్సువఱకు నుండు వాయువు స్వేచ్ఛామృతి = అర్చిరాది మార్గముగుండ బ్రహ్మలోకమునకు బ్రహ్మరంధ్రమును బేదించి లింగదేహము వెలుపలికి స్వేచ్ఛగా నిష్క్రమించునని భావము. భీష్మాదులు ఇట్లు స్వేచ్ఛగా మృత్యువును బొందిరి.

39 సమాన జయా త్ప్రజ్వలనమ్

సూ. సమానవాయుజయమువల్ల శరీరము ప్రజ్వలించును.

వివ:- సమానవాయువు = సర్వనాడులందు సంచరించువాయువు. ఇట్టి యోగాగ్ని చేతనే సతీదేవి దక్షయజ్ఞములో శరీరత్యాగము చేసెను.

40. శ్రోత్రాకాశయోః సంబంధ సంయమాద్దివ్యం శ్రోత్రం

సూ. శ్రోత్రాకాశముల యాధారాధేయ సంబంధ సంయమమువలన దివ్య శ్రోత్రము గలుగును.

వివ:- ఇది మిగిలిన చక్షురాదీంద్రియములకుఁ దన్మాత్రలకుఁగల సంబంధ సంయమమువలన దివ్యచక్షురాదులు గలుగుటకు ఉపలక్షణము.

41. కాయాకాశయోః సంబంధసంయమా ల్లఘు తూల సమాపత్తే శ్చాకాశ గమనం

సూ. కాయాకాశ సంబంధ సంయవముచలనను, సంయమముచే దూది వలెఁ దేలికఁదనము పొందుటవలనను, ఆకాశగమనము సిద్ధించును,

వివ:- తేలికఁదనము పొంది జలముపైని గాళ్ళతోఁ ఉరుగును. సాలెపురుగు దారమునకూడ విహరించుచుఁ గిరణములపైని విహరించును. పిదప యథేష్టముగ ఆకాశగతి సిద్ధించునని భావము.

42. బహిరకల్పితా వృత్తి ర్మహావిదేహా తతః ప్రకాశా వరణ క్షయః

సూ. శశీరాపేక్ష లేకుండ వ్యవహితాదులందు వర్తించుట మహావిదేహమని చెప్పఁబడును. దానివలన బుద్ధిసత్త్వ ప్రకాశముయొక్క యావరణము నశించును.

వివ:- సత్త్వావరణము = రజస్తమోగుణాదులు. శరీరమునుండి విడివడి యుండుట విదేహధారణ యనఁబడును. అది దేహమందున్న మనస్సునకంటె వెలుపలనున్నచో కల్పితమనఁబడును. శరీరాపేక్ష లేకుండఁగా వెలుపలనున్న మనస్సు అట్లే వెలుపలనుండుట అకల్పిత మనఁబడును. అదే మహావిదేహమని యనఁబడును. దానిచే యోగులు వరశరీరమును బ్రవేశింతురని భావము

43. స్థూల స్వరూప సూక్ష్మాన్వ యార్థవత్త్వ సంయమా ద్భూత జయః

సూ. స్థూల స్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వముల సంయమమువలన భూతజయము గలుగును.

వివ:- శబ్ద స్పర్శ రూప రస గంధములతోను ఆకారము గౌరవము మొదలగు పంచభూత ధర్మములతోను గూడిన యవయని స్థూలమన

డును. షడ్జ గాంధారాది స్వరములు శబ్దములు శీతోష్ణాదులు స్పర్శలు, నలుపు తెలుపు మొదలయినవి రూపములు. తీపి పులుపు మొదలయినవి రసములు. సువాసనాదులు గంధములు. ఈనామ రూపాదులు ఒకదానికంటె నొకటి వేఱుగా నుండునుగాన విశేషములు అనఁబడును. భూమియందు ఆ యయిదుగుణములు, నీటియందు గంధముగాక మిగిలిననాలుగు, తేజస్సున గంధరసములుగాక మిగిలినమూఁడు, గాలిలో శబ్దస్పర్శలు, ఆకాశమున శబ్దమును ఉండును. భూమియందు ఆకారము గుణత్వము, రూక్షత్వము, ఆవరణము, స్థిరత, సర్వాధారత, బ్రిద్దలగుట, ధారణశక్తి, నలుపుఁదనము, కఠినత్వము, సర్వభోగ్యత అనుగుణము లుండును, జలమందు స్నేహము, సూక్ష్మత, ప్రభ, తెలుపుదనము, మెత్తఁదనము, గురుత్వము, చల్లఁదనము, రక్షణ, పవిత్రత, సంధానము అనుగుణములుండును. తేజస్సునందు పైకిఁబోవుట, పాచకశక్తి, తగులఁబెట్టుట, పవిత్రత, తేలికఁదనము, ప్రకాశము, నశింపఁజేయుట, ఓజస్సు అను గుణములుండును, గాలియందు అడ్డముగా వీచుట, పవిత్రత, చిమ్ముట, ప్రేరేపణబలము, చంచలత, కాంతిలేకపోవుట, రూక్షత అనుగుణము లుండును. ఆకాశమునందు వ్యాపకత అన్నిటిని లీనము చేసికొనుట అవకాశ మిచ్చుట అను గుణములుంటును ఇది స్థూలరూపము. సామాన్య విశేష గుణ సముదాయము ద్రివ్యము, కలిసిగాని, విడిగాఁని, ఏకముగాఁగాని భిన్నముగాఁగాని యున్న పదార్థములు ద్రవ్యములు. ఉదా:- శరీరము, వృక్షము, పరమాణువు, యూథము, వనసంఘము మొ॥ ఆ ద్రివ్యముల కాఠిన్య స్నేహోష్ణతా వహన క్రియతాఽవకాశ దావత్వాలుగల భూమిత్వాదులు స్వరూపము సూక్ష్మరూపము=తన్మాత్రిలు (తత్=ఆభూతముల మాత్రిలు=గుణములు). అన్వయము=ఖ్యాతి. క్రియాస్థితిశీలములు గలిగి కార్యస్వభావమును బొంటిన గుణములు. అర్థవత్త్వము = సర్వప్రాణులందున్న [illegible] పురుషార్థములు. ఈ యయిదు విధము లయిన రూపములను సంయమము చేసికొనుటవలన వత్సను గోవు అనుసరించునట్లు సంయమియొక్క సంకల్పములను భూతప్రికృతు లనుసరించునని భావము.

44. తతో అణిమాది ప్రాదుర్భావః కాయసంపత్తద్ధర్మా
సభిఘాతశ్చ

సూ. భూతజాయముచే వలన అణిమాది ప్రాదుర్భావము కాయసంపద, భూత ధర్మములచేఁ దిరస్కరింపకుండుటయుఁ గలుగును.

వివ:- 1అణిమ, మహిమ, 3లఘిమ, 4ప్రాప్తి, 5ప్రాకామ్యము, 6ఈశిత 7 వశిత, 8 సత్యసంకల్పము ఇవి అణిమాద్యష్ట సిద్ధులు. శరీర, మణుత్వమును పొందుట అణిమ. శరీరమును యోజనములవఱకు వ్యాపించుట మహిమ, శరీరము దూదివలె లఘువగుట లఘిమ. భూమియందే ఉండి వ్రేలిచివరచే చంద్రుని స్పృశించుటమొదలగు నింద్రియ శక్తులు ప్రాప్తి, ప్రసిద్ధముగాఁ గనఁబడు పదార్థము లందు స్వేచ్ఛగా నుండుట ప్రాకామ్యము. భూమిపైని జలము లందువలె మునుఁగుట. తనశరీరమువలె సర్వభూతములను సంకల్పమాత్రముచే ప్రేరేపించుట ఇతరులకు వశముగాకుండుట ఈశిత, భూతభౌతికమగు గుణములను వశపరచుకొనుట వశిత్వము. సంకల్పించినది సత్యమగుట సత్య సంకల్పత్వము ఉదా:- విష మునుగూడ అమృతముగా సంకల్పించి భుజించి జీవించుట. "తద్ధర్మములచేఁ దిరస్కరింపఁబడకుండుట" అని ప్రత్యేకముగాఁ జెప్పఁబడుటచే అణిమాదులలో ప్రాకామ్యము చేరలేదు. రెండు నొకటే. ముందుసూత్రములో సూత్రకర్తచేతనే కాయసంపద వ్యాఖ్యానము చేయఁబడుచున్నది. భూతములచే తిరస్కరింపఁబడకుండుటయనఁగా రాతినిగూడఁ బ్రవేశించుట. నీరు తడపఁజాలకపోవుట. నిప్పు కాల్పలేకపోవుట. గాలి కదల్పలేకపోవుట. ఆవరణ లేనియాకాశములోఁగూడ ఆవరింపఁబడిన శరీరము గలవాఁడై యుండుట. సిద్ధులకుఁ గూడ అదృశ్యుఁడై యుండుట. సంకల్పసిద్ధుఁడైన పరమేశ్వరుని యాజ్ఞాబద్ధమయి యుండుటవల్ల సృష్టిని మాత్రము తలక్రిందులు చేయలేఁడు తదితర శక్తులను బొంది విహరించునని తెలియవలయును.

45. స్వరూప లావణ్య (బల) వజ్రసంహననత్వాని కాయ
సంపత్

సూ. రూపలావణ్య వజ్రతుల్యావయవ బలములు కాయసంపద యనబడును.

46. గ్రిహణ స్వరూపాస్మి తాన్వయార్థవత్త్వ సంయమాదింద్రియ జయః

సూ. గ్రహణ, స్వరూ, పాస్మి, తాన్వయార్థవత్త్వ సంయమమువల్ల నిద్రియ జయము గలుగును.

వివ:- గ్రిహణము=నిశ్చయాభిమాప సంకల్పదర్శన శ్రవణాది వృత్తులు, స్వరూపము=ఏకాదశేంద్రియములు, అస్మిత=బుద్ధ్యహంకారములు, అన్వయము అర్థవత్త్వము ఇవి పూర్వసూత్రములో వ్యాఖ్యానింపబడెను.

47. తతో మనోజవిత్వం వికరణభావః ప్రిధానజయశ్చ

సూ. ఇంద్రియ జయమువల్లమనోజయమును, ఇంద్రియ వికీర్ణతయును ప్రిధానజయమును గలుగును.

వివ:- ఇంద్రియ వికీర్ణత=స్థూలదేహాపేక్షలేకుండ అన్నియెడల ప్రవర్తించుట ప్రిధానజయము = స్వేచ్ఛగా ప్రకృతిని మార్పుచేయుట. ఈసిద్ధులను మధుప్రతీకములు మధుమతిసిద్ధులు అందురు.

48. సత్త్వ పురుష తాన్యఖ్యాతి మాత్రిస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతత్వంచ

సూ. సత్త్వ, పురుష వివేకముగలవానికి ప్రకృతి పురుష వికారములందు ప్రభుత్వమును సర్వజ్ఞత్వమును సిద్ధించును.

వివ:- దీనిని విశోకసిద్ధి యందురు.

49. తద్వైరాగ్యా దపి దోషబీజ క్షయే కైవల్యం

సూ. ఈ సిద్ధివలన ప్రిభుత్వ సర్వజ్ఞత్వములందుఁగూడ వైరాగ్యముగలుగుటవలన వాసనారూపదోషములు నశింపఁగా మోక్షము సిద్ధించును

**50. స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పున
రనిష్టప్రసంగాత్**

సూ. స్వర్గాదిప్రాప్తికి ఆవతలనుండి పిలుపువచ్చినను "ఆ పుణ్యము అనుభవముచే నశింపఁగా తిరిగి యనిష్టము గలుగు"నని తలఁచి అస్థిరములగు స్వర్గాదులందు సంగము అభిమానము నుంచుకొనక పోవుటయె కైవల్యమున కుపాయము.

వివ:_ ప్రాథమ కల్పికుఁడు (=అభ్యాసము చేయువాఁడు) మధుభూమికుఁడు (=సత్యప్రజ్ఞ గలిగి యింద్రియ జయేచ్ఛగలవాఁడు) ప్రజ్ఞాజ్యోతి (విరక్తుఁడు జీవన్ముక్తుఁడు) భావనీయుఁడు అని యోగులు నలుగురు. అందు మధుమతియను సిద్ధిని పొందిన మధుజ్ఞానికుని దగ్గఱకు మాత్రమే దేవతలు వచ్చి "ఇటఁగూరుచుండుము. ఇటఁ గ్రీడింపుము. ఈ భోగములు రమ్యములు. ఇదిగో ఆకాశయానము. అనుకూలమైన యప్సరస లిరుగో, దివ్యశ్రోత్రము దివ్యనేత్రమును ఇవిగో, నీ శరీరము వజ్రసమానమైనది. అనుభవింపుము. ఇది యంతయు నీ సాధనలవల్ల లభించినదే. దీనికి నాశము లేదు. ముసలితనము లేనిది. ఇది దేవతలకుఁ బ్రియము" అని యాహ్వానింతురు. ఇట్లు ఆహ్వానింపఁగా "సంసారాగ్ని యందుఁ దగులఁబడి జన్మ మరణాంధకారములందు దొరలుచున్న నేను ఈనాఁటికి క్లేశతిమిరములను నశింపఁజేయు యోగప్రదీపమును సంపాదించితిని. దీనిని విషయ వాయువులు వీచియార్పును. ప్రకాశమును పొందిన నేను దిరుగ నీవిషయవాంఛలచే మోసగింపఁ బడుచుంటివి. ఈ సంసారాగ్నికి నా శరీరమును గట్టెలుగాఁ జేయుదునా? నీచులు గోరునవియుఁగలవంటియునగు ఈ భోగములకు నమస్కారము" అని నిశ్చయించుకొని సమాధిని భావింప వలయును. ఇట్లు భావించి సంగమును వీడి "దేవతలచే నిట్లు కోరికలు పొందుమని ప్రార్థింపఁబడుచున్నాను. నేనెంత గొప్పవాఁడను" అను నహంకారమును గూడ వీడి "ఎపుడు సమయము దొరుకునా ఎపుడు క్రిందఁ బడఁద్రోయుదునా" అని కనిపెట్టుకొని యున్న ప్రమాద దేవతకు లొంగక దృఢనిశ్చయముతో నుండు యోగిని

మోక్షము తనంత తానే వరించును. ఒకవేళ ప్రమాద దేవతకు లొంగెనా మృత్యువు జుట్టుపట్టుకొని యీడ్చినట్లు క్రిందకు ఈడ్వఁబడి ఆత్మను భావింపఁడని తలఁపవలయును.

**51. క్షణ తత్క్రమయోః సంయమాత్ వివేకజం జ్ఞానం**

సూ. క్షణమును క్షణములనుండి ప్రవాహరూపముగాఁ గలుగు కాలక్రమమును సంయమము చేయుటవలన వివేకజజ్ఞానము గలుగును.

వివ:- క్షణాది కాలక్రమమునుబట్టి సర్వలోకము పరిణామమును బొందుచున్నది. ఈ ధర్మములన్నియు ఆ క్షణమును బట్టియే యగుచున్నవి. కాన ఆ క్షణమును క్షణకాల ప్రవాహమును సంయమమును జేయుటవలన వివేక జ్ఞానము గల్గునని భావము.

**52. జాతిలక్షణ దేశైరన్యతానవచ్ఛేదా త్తుల్యయో స్తతః ప్రతిపత్తిః**

సూ. తుల్య వస్తువులకు జాతి లక్షణదేశములవే భేదము నిరూపించుటయసంభవము గాన క్షణమును క్షణసహిత కాలక్రమమును సంయమము చేయుటవలన భేదజ్ఞానము గలుగును.

వివ:- లోకమున వస్తుభేదమును జాత్యాదులఁబట్టి తెలిసికొందుము. దేశము లక్షణము సమానమైనను ఇది గోవు ఇది బడబ అని గోత్వాది జాతిని బట్టి భేదము తెలిసికొందుము. దేశము జాతి సమానమైనను ఇది నల్లని కన్నుగల యావు. ఇది సాధువైన యావు అని లక్షణమును బట్టి భేదము తెలిసికొందుము. జాతియు లక్షణము సమానమైనను ఇది తూర్పున నున్న యుసిరికకాయ ఇది పడమరగా నున్న యుసిరికకాయ యని దేశమునుబట్టి భేదము తెలిసికొందుము. పర ధ్యానమునందు ఉండునపుడు తూర్పున నున్న యుసిరికకాయను పడమరకును పడమరగా నున్న యుసిరిక కాయను తూర్పునకు మార్చినచో నెట్లు నిర్ధారణగాఁ దెలికొనఁగలము అను ప్రశ్నకు తత్తద్వస్తుగతమైన క్షణమును తద్రూపములను సంయమము చేయుటవలన యోగికిఁ దెలియునని యిందు సమాధానము చెప్పఁ

బడెనని తెలియునది. ఇట్లే యోగికిఁ బరమాణుజ్ఞానము పరమాణుగత విశేషముల జ్ఞానమును గలుగునని భావము. వ్యవధానము విషయములోఁ గూడ నిట్లే యోగికి జ్ఞానము గలుగునని భావము.

## 53. తారకం సర్వవిషయం సర్వథా విషయక్రమం చేతి వివేకజం జ్ఞానమ్

సూ. వివేకజ్ఞానము సార్వవిషయక జ్ఞానముగల దగుటచేతను అన్ని విధములైన విషయక్రమములు గల దగుటచేతను అన్ని యెడల దోషముచూచి నందువలనఁ గలిగిన వైరాగ్యము ద్వారా సంసార తారకమగును.

## 54. సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్

సూ. బుద్ధిగతసత్త్వమునకుఁ బురుషునితోఁ గూడ శుద్ధిసామ్యము గలిగినపుడు మోక్షమగును.

వివ:- పురుషునికి అభిమానము లేకపోవుటయె శుద్ధి. కాల్చివేయఁబడిన గింజ మరల మొలకెత్తఁజాలనట్లు జ్ఞానముచే శుద్ధమైన పురుషుఁడు తిరుగ జన్మమరణముల నొందక మోక్షము పొందునని భావము. ఈ యష్టాంగ యోగము లభ్యసించినను ఆ సిద్ధులందు వైరాగ్యము గలిగిన యెడలను ప్రతిబంధకమగు పాపమున్న యెడలను పై సిద్ధులు ఫలింపవని గ్రహింపవలయును.

ఇది

పతంజలిచే రచింపఁబడి చర్ల గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన యోగతత్త్వ దర్శనమందు విభూతి పాదము.

# 4. మోక్షపాదము

## 1. జన్మౌషధి మన్త్ర తపః సమాధిజాః సిద్ధయః

సూ. జన్మము ఓషధి మంత్రము తపస్సు సమాధి అను వీనివల్ల సిద్ధులు పొడముసు.

వివ:- జన్మచేతనే సిద్ధి గలుగుట యనఁగా క్రిందటి దేహాదులచే వ్యవధానము కలిగినపుడు క్రిందటి జన్మసాధనచే ఈ జన్మయందు సిద్ధి కలుగుట.

## 2. జాత్యన్తర పరిణామః ప్రకృత్యాపూరాత్

సూ. దైవాది ప్రకృతులు ప్రవేశించుటవల్ల మనుష్యాది జాతులకు దేవాది జాత్యంతరపరిణామము గలుగును.

## 3. నిమిత్త మప్రయోజకం ప్రకృతీనాం వరణ భేదస్తు తతః క్షేత్రికవత్

సూ. ధర్మాదిరూపమైన నిమిత్తకారణము ఆయా ప్రకృతులను ప్రవర్తింపఁ జేయునదిగాదు. కాని హెచ్చుతగ్గులు లేకుండ కర్షకుడు సమముగా బోదెలు చేయుటవల్ల నీటి కడ్డుగలుగనట్లు ధర్మాదుల వలన అధర్మాది ప్రతిబంధకములు మాత్రము పోవును. అపుడు ప్రకృతులకు ధర్మాది ప్రయోజనములు గలుగును.

## 4. నిర్మాణచిత్తా న్యస్మితామాత్రాత్

సూ. యోగి యనేక శరీరములను నిర్మించినపుడు ఆ యోగి యొక్క యహంకారమువలనఁ గలుగు కార్యసిద్ధిలోని సంకల్పముచే మనస్సులు అనేకములగును.

వివ:- అట్లు గానిచో ఒకే మనస్సుచే విరుద్ధ విషయములను సమాధులను ఒక్కసారే యనుభవించుట శక్యముగాదని భావము.

5. ప్రవృత్తిభేదే ప్రయోజకం చిత్త మేక మనేకేషామ్

~~సూ. ఆ యనేక~~ చిత్తములను ఆయా ప్రవృత్తులందు ప్రవర్తింపఁ జేయునది ఒక్క చిత్తము మాత్రమే.

6. తత్ర ధ్యానజ మనాశయమ్

సూ. అందు ధ్యానముచే శుద్ధమైన చిత్తమునకు రాగాదివాసన లెవ్వియు నుండవు.

7. కర్మా శుక్లాకృష్ణం యోగిన స్త్రివిధ మితరేషామ్

సూ. సమాధిసిద్ధుఁడగు యోగిచేయు కర్మ పుణ్యములకుఁగాని పాపములకుఁ గాని హేతువుగాదు. ఇతరులు చేయు కర్మ పుణ్యములకు పాపములకు పుణ్యపాపములకు హేతువయి త్రివిధముగ నుండును.

వివ:- పుణ్యములు=మానసిక యజ్ఞాదులు, పాపములు=నిషిద్ధ దుష్ట కర్మాదులు పుణ్యపాపములు=భౌతిక యజ్ఞ యుద్ధాదులు.

8. తత స్తద్విపాకానుగుణానా మేవాభివ్యక్తి ర్వాసనానామ్

సూ. అట్టి త్రివిధమగు కర్మవలన తత్ఫలానుగుణమైన వాసనలె యభివ్యక్తమగును.

వివ:- ఆ పాపపుణ్యాది వాసనలవలన తత్త్వజ్ఞానాదులు గలుగునని తెలియునది.

9. జాతి దేశ కాల వ్యవహితానా మప్యానన్తర్యం స్మృతి సంస్కారయో రేకరూపత్వాత్

సూ. జన్మనుబట్టి దేశమునుబట్టి వాసనలకు వ్యవధానమున్నను స్మృతియును దానివలన నేర్పడిన సంస్కారమును ఏక రూపముగా నుండుట వలన వ్యవధానము గలుగదు.

**వివ:**_ అందుచేతనే యిదివఱకు అనుభవింపఁబడిన స్తన్యపానాదులందు తనంతనే ప్రవృత్తి గలుగుచున్నదని భావము.

## 10. తాసామనాదిత్వం చాశిషో నిత్యత్వాత్

**సూ.** "ఇట్లు ఇదివఱకు లేను. ఇకముందు ~~ఉండకుందును~~ గాక" అను ప్రార్థన నిత్యముగా నుండుట వలన ఆ వాసనలు అనాదులు.

**వివ:**_ ఆ వాసనలు అనాదులు గనుకనే పుట్టి పుట్టఁగనే యీ జన్మలో మరణ భయము అనుభవింపకున్నను జీవునికి ద్వేష దుఃఖముల స్మరణ వలన పూర్వ జన్మమందు అనుభవింపఁబడిన మరణ భయము గలుగుచున్నది. ఆ మరణభయము స్వాభావికమనుటకు వీలులేదు. అందుచే అనాది వాసనలతోఁ గూడిన చిత్తమే వివిధ వాసనలను బొంది సంచరించుచున్నది. చిత్తము వ్యాపకమైనది. అది దాని కాశ్రయమగు వానినిబట్టి సంకోచ వికాశములు గలది. ఆ చిత్తమందుఁ బూర్వానుభూత విషయములు వాసనా రూపముగ అనాదిగా నుండి సమయము వచ్చినపుడు ప్రకట మగుచుండునని తెలియునది.

## 11. హేతు ఫలాశ్రయాలంబనైః సంగృహీతత్వా దేషామభావే తదభావః

**సూ.** హేతు ఫలాశ్రయాలంబనములతో సర్వ వాసనలు వ్యాప్తములై యుండుటచే ఆ హేత్వాదులను నశింపఁజేసినపుడు దాని నాశ్రయించి యుండు వాసనలు గూడ మోక్ష సమయమునఁ బూర్తిగా నశించిపోవును.

**వివ:**_ వాసనలకు హేతువు అవిద్య. ధర్మాదులకుఁ బ్రవర్తకమైన పురుషార్థము ఫలము. వాసనలకు ఆశ్రయము మనస్సు. వాసనల కాలంబనాదులు కామినీ దర్శనాదులు. వాసనలు అనాదులయినను వాసనలకు హేతువయిన అవిద్యను నశింపఁజేయుగా వాసనలు నశించును. అపుడు మోక్షము సిద్ధించునని భావము.

## 12. అతీతానాగతం స్వరూపతః అస్త్యధ్వ భేదా ద్ధర్మాణామ్

సూ. ధర్మములకు భూత భవిష్యద్వర్తమాన రూపావస్థాభేదము లుండుట వలన వర్తమానమందువలె భూత భవిష్యత్తులందును వికారములు స్వరూపముతోనే యుండును.

వివ:- ధర్మములు=కార్యములు. ఆ కార్యములు సూక్ష్మ రూపముగా నెల్లపుడు నుండును. వ్యంగ్యము కాఁబోవు రూపముతో భూత భవిష్యత్తును ప్రస్తుత వ్యక్త రూపముతో వర్తమానమును ఉండునని భావము.

## 13. తే వ్యక్త సూక్ష్మ గుణాత్మానః

సూ. వ్యక్తములు సూక్ష్మములునైన యా ధర్మములు సత్త్వరజస్తమో గుణ రూపములయి యుండును.

వివ:- గుణముల వాస్తవరూపము పైకిఁ గనిపింపదు. కనిపించునప్పటి రూపము మాయ యని భావము.

## 14. పరిణామైకత్వా ద్వస్తు తత్త్వమ్

సూ. వాస్తవముగా వస్తుతత్త్వము త్రిగుణాత్మకమైనను శ్రోత్రతన్మాత్రమగు శబ్దమొకటి, చక్షుస్తన్మాత్రమగు రూపమొకటి యని యీ విధముగా నగుట వ్యవహారములో ఒకటేరకమగు పరిణామము గలుగుటవలన నని యెఱుంగునది.

వివ:- గుణములు వికారములు అనేకమైనను శబ్దత్వ స్పర్శత్వ రూపత్వ రసత్వ గంధత్వ రూపజాతులనుబట్టి ఒకటే శబ్దమిత్యాది వ్యవహారములు గలుగుచున్నవి. "దృశ్యవస్తుజ్ఞానము ఆ వస్తువులతోపాటే గలుగుచున్నది గాన ఆ వస్తుజ్ఞానముకంటె వస్తువులు భిన్నములు" గావని విజ్ఞానవాదు లందురు. అయా వస్తుజ్ఞానములు భిన్నముగా అదే యిది యని ప్రత్యభిజ్ఞానములో వేఱువేఱుగాఁ గలుగుటవలన అట్లు అనరాదని భావము.

## 15. వస్తుసామ్యే చిత్తభేదా త్తయో ర్విభక్తః పన్థాః

సూ. ఒక వస్తువునందె యాయా వ్యక్తులనుబట్టి చిత్తభేదముదయించుట వలన ఆ వస్తుచిత్తముల మార్గము వేఱువేఱుగా నుండును.

వివ:- అనేకుల చిత్తములకు ఆధారమై యొకటేవస్తువు సమముగానుండును అది ఒక్కచిత్తముచేతనే కల్పింపఁబడినదిగాదు. అనేక చిత్తముల చేఁ గూడఁ గల్పింపఁబడినదిగాదు. ఆ వస్తువునందె యట్టి స్థితి గలదు. వస్తువొకటేయైనను చిత్తము లనేకము లగుటవలన అట్లు గలుగుచున్నది. ఒక స్త్రీయందు, భర్తకు భార్యయను భావమును సవతికి దుఃఖభావము ఆమె సంగతి తెలియనివానికి అజ్ఞానము గలుగును. ఇట్లీ యన్నిటి యందును. కనుక వస్తుజ్ఞానములకు గ్రాహ్య గ్రహణ భేదములను బట్టి వాని మార్గము వేఱువేఱయి యుండును. అసలు వస్తువు త్రిగుణాత్మకము గాన సుఖదుఃఖాది జ్ఞానము గలుగుచుండుట తత్త్వము. దీనినిబట్టి "చిత్తముచేఁ గల్పింపఁ బడినది కలవలె లేనిది" అని యనరాదని భావము.

## 16. నచైక చిత్త తన్త్రం వస్తు తత్ప్రమాణకం తదా కిం స్యాత్

సూ. వస్తువు తద్విషయకమైన విజ్ఞానమందు మాత్రమే యుండదు. అట్లు ఉండునన్నచో నింక దానికిఁ బ్రమాణమైన వస్తు వింకొకటి యేమై యుండును?

వివ:- వస్తువు స్వతంత్రమైనది. తద్విషయక జ్ఞానములును స్వతంత్ర ములె, అవి యన్నియు నొక్కటే యన్నచో జ్ఞానములు నశించి నప్పుడు వస్తువులు గూడ నశింపవలసివచ్చును. అందుచే "జ్ఞాన ములకంటె వస్తువులు వేఱుగా నుండ"వనరాదని కొందఱు "జ్ఞానము కంటె వస్తువులు భిన్నములైనను ఆ వస్తువు జ్ఞానముచే భాసింపఁ దగిన దగుటవలన జ్ఞానసమయమందె కాని మఱి యెప్పుడు ఉం డదు. మఱి యది సుఖదుఃఖాదులవలె అనుభవింపఁదగిన దగుట వలన జ్ఞానముతో పాటె పుట్టును" అందురు. దీనినే దృష్టి సృష్టి వాదమందరు. ఈ వాద మీ సూత్రములో ఖండింపఁబడినది.

పదార్థములు సర్వ పురుష సాధారణములైనవి. చిత్తములును పదార్థములవలె స్వతంత్రములు గాన అవి ప్రతి పురుషుని గూర్చి ప్రవర్తించుచుండును. వాని సంబంధమువలనఁ బురుషుని భోగము గలుగునని భావము.

## 17. తదుపరాగాపేక్షిత్వాచ్చిత్తస్య వస్తుజ్ఞాతాజ్ఞాతమ్

సూ. చిత్తము ఆయా విషయముల నాకార సంబంధము నపేక్షించి యుండుటవలన వస్తువు తెలియఁబడినదిగను తెలియఁబడనిదిగను నుండును.

వివ:_ విషయములు సూదంటుఱాయివంటివి. చిత్తము ఇనుమువంటిది. ఆ విషయములు జిత్తమును సంబంధించి రంజింపఁ జేయును విషయ సంబంధమునఁ జిత్తము ఆయా విషయములను గ్రహించును. మిగిలినవి దానిచేఁ దెలియవు. కాన చిత్తము తెలిసికొనుచును తెలిసికొనకయును ఉండి పరిణామమును పొందుచున్నదని భావము.

## 18. సదా జ్ఞాతాశ్చిత్తవృత్తయస్తత్ప్రభోః పురుషస్యాపరిణామిత్వాత్

సూ. చిత్తవృత్తుల ననుభవించు పురుషుఁడు నాకార సంబంధాది పరిణామ శూన్యుఁ డగుటవలనఁ జిత్తవృత్తు లెల్లపుడును జ్ఞాతములై యుండును.

వివ:_ ఇదివఱలోఁ జిత్తమును పదార్థములు వేఱని చెప్పఁబడెను. ఇపుడు పురుషుఁడును చిత్తమును వేఱని యిందుఁ జెప్పఁబడినది. చిత్తమువలెఁ బురుషుఁడును పరిణామమును జెందుచోఁ జిత్తవృత్తులు శబ్దాది విషయములవలె జ్ఞాతాజ్ఞాతములై యుండవలసి వచ్చును. పురుషుఁడు అపరిణామి గాన ఎల్లపుడును తెలిసికొనువాఁడయి యుండునని భావము.

## 19. న తత్స్వాభాసం దృశ్యత్వాత్

సూ. "ఎఱుఁగుదును, కోరుచున్నాను" ఇత్యాదులైన యనుభవములు కనుపట్టుటవలనఁ జిత్తవృత్తి రూపము స్వయం ప్రకాశము గలది గాదు.

వివ:- "ఎఱుఁగుదును, కోరుచున్నాను" ఇత్యాదులలోఁ గర్త "నేను" అనునది. "చిత్తవృత్తిని" అనునది కర్మ. కర్మగా నున్నది మరలఁ గర్తగా నుండదు. కాన పురుషుఁడే చిత్తవృత్తిని ప్రకాశింపఁ జేయును. ఇటఁ జిత్తవృత్తియే తన్నుఁ బ్రకాశింపఁ జేయుననరాదు. అందుచేఁ జిత్తవృత్తి నెఱిఁగినవాఁడు వేఱుగా నున్నాఁడని భావము.

## 20. ఏకసమయే చోభయానవధారణమ్

సూ. చిత్తవృత్తి యొకే సమయమున తన్ను నితరుని ఈ రెండింటిని గ్రహింపలేదు.

వివ:- చిత్తవృత్తి బయలుదేఱిన సమయములోనే తన్నుఁ దాను ప్రకాశింపఁ జేయులేదు. పోని మొదటి క్షణములో తన్నును ద్వితీయ క్షణములో ఇతరునిఁ దెలియఁజేయునందమన్నచో శబ్ద బుద్ధి కర్మలు నొక పనిచేసి ముగించిన పిదపఁ దరువాత నింకొక దాని ఆ రెండు సంగతులను గ్రహించుట సంభవింపదు. కాన పురుషుఁడు వేఱుగా గ్రహించువాఁడున్నాడని భావము.

## 21. చిత్తాన్తర గ్రాహ్యే బుద్ధిబుద్ధే రతిప్రసంగః స్మృతి సంకరశ్చ

సూ. ఈ చిత్తవృత్తిని ఇంకొక చిత్తవృత్తి గ్రహించునని యన్నచో ఒక చిత్తవృత్తిని ఇంకొక చిత్తవృత్తి దాని నింకొకటి యని యీ విధముగాఁ జిత్తవృత్తుల కంతులేని స్థితి గలుగును. అపుడు పూర్వ చిత్తవృత్తుల స్మృతిలోఁ గూడ స్మృతులు అనేకమై వానికి సాంకర్యము గలుగవలసి వచ్చును.

వివ:- స్మృతులు అనేకమై సాంకర్యము గలిగినచో నిశ్చయ జ్ఞానము గలుగక సర్వము వ్యాకులమైపోవునని భావము.

## 22. చితేరప్రతిసంక్రమాయా స్తదాకారాపత్తౌ స్వబుద్ధి సంవేదనమ్

సూ. పరిణామము పొంఁదని చిత్పురుషుఁడు చిత్తవృత్తి రూపము పొంది స్వబుద్ధి వృత్తులను దర్శించును.

వివ:- చంద్రుడు గదలకున్నను జలములోఁ బ్రతిబింబించుటచే ఆ జల చలనాదులను బట్టి చలనాదులున్నట్లు తోఁచిన విధముగాఁ బరిణామము లేని పురుషుఁడు పరిణామము పొందెడు చిత్తవృత్తినిబట్టి పరిణామము పొందువాఁడువలెఁ దోఁచునని భావము.

23. ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థమ్

సూ. ద్రష్ట యగు పురుషుని చేతను దృశ్యమగు సకల జగము చేతను చేతనాచేతన రూపము పొందిన చిత్తము గ్రహీతృ గ్రహణ గ్రాహ్య రూపము లనుదృశ్యము లన్నిటి కాధారమైనది.

వివ:- పురుషునికిఁ జిత్తముతో సారూప్యముండుటను బట్టి కొందఱు "చిత్తమునే చేతనరూపుఁడగు పురుషుఁ" డనియుఁ గొందఱు "ఇదంతయుఁ జిత్తమె యింకేమియు లేదు" యని యందురు. వారి యజ్ఞానమునకు జాలిపడవలయును. వారికి భ్రాంతిచే అట్లు తోఁచుచున్నది. సమాధి ప్రజ్ఞ గలిగిన వానికది యవగతమగును. కానఁ జిత్తమునఁ బ్రతిబింబించిన పురుషుఁడు వేఱుగా నున్నాఁడని భావము.

24. తదసంఖ్యేయ వాసనాభి శ్చిత్ర మపి పరార్థం సంహత్య కారిత్వాత్

సూ. అసంఖ్యాకములగు ద్రష్టృ దృశ్య దర్శన గోచరములగు జన్మ వాసనలచే జిత్రమైనను జిత్తము ఇంద్రియముతోఁ గలసిమెలసి పనిచేయుచు అర్థక్రియాకారి యగుటవలనఁ బరార్థమె యగును.

వివ:- ఆ చిత్తము నిత్యోదాసీనుఁడగు పురుషుని భోగము కొనమే గాని స్వార్థము కొనము గాదని భావము.

25. విశేష దర్శిన ఆత్మ భావ భావనా వినివృత్తిః

సూ. వివేకమును సాక్షాత్కరింపఁ జేసికొన్నవానికి తన భావమందుఁ గలిగిన "నే నెవఁడను, నే నెట్లుంటిని, ఇది యేమి ఎట్లు అగుదునో" అనెడు శోకాద్యనర్థహేతువయిన భావన నివర్తించును.

26. తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తమ్

సూ. విశేష జ్ఞానదర్శనావస్థ యందుఁ గైవల్యాభిముఖమగు చిత్తము వివేకమార్గమందు సంచరించును.

27. తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః

సూ. విశేష దర్శనము గలిగినప్పుడు గూడఁ బూర్వజన్మ సంస్కారముల వలన మధ్యమధ్య విశేష దర్శనము యొక్క యవకాశములందు "నేను నాది" అని మిథ్యాజ్ఞాన రూపమగు తదితర జ్ఞానములును గలుగును.

28. హానమేషాం క్లేశవదుక్తమ్

సూ. ఈ సంస్కారములను క్లేశములను త్యజించినట్లు త్యజింపవలెనని పూర్వులచేఁ జెప్పబడినది.

వివ:_ తగులఁబెట్టఁబడిన గింజలు మొలవఁజాలనట్లు జ్ఞానాగ్ని దగ్ధములగు సంస్కారములు మొలవవు. కాన ఆ సంస్కారములు జ్ఞానముచేఁ ద్యజింపవలెనని భావము. "జ్ఞానాగ్నిస్సర్వ కర్మాణి భస్మ సాత్కురు తేఽర్జున" అని గీత.

29. ప్రసంఖ్యానే అప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతే ర్ధర్మమేఘః సమాధిః

సూ. వివేకజ్ఞానము గలిగినప్పుడు గూడ ఫలసిద్ధులను గోరనివానికి నిరంతరము వివేక ముదయించుట వలన ధర్మమేఘమను సమాధి గలుగును.

వివ:_ ధర్మమును వర్షించునది ధర్మమేఘ మనఁబడె నని తెలియునది.

30. తతః క్లేశకర్మ నివృత్తిః

సూ ఆ సమాధివలన క్లేశములును పూర్వకర్మలును నివర్తించును.

31. తదా సర్వావరణ మలాపేతస్య జ్ఞాన స్యానన్త్యాత్ జ్ఞేయమల్పమ్

సూ. సర్వావరణ రూపదోషములచే ముక్తుఁడైన వానికి జ్ఞానము అనంతముగా నుండుటవలన నింకఁ దెలిసికొనఁదగినది అల్పమే.

32. తతః కృతార్థానాం పరిణామ క్రమ సమాప్తి ర్గుణానామ్

సూ. పిదప సత్త్వాది గుణములు, తాము పొందవలసినవి పొందుటచేఁ గృతార్థములు కాఁగా వాని పరిణామక్రమమును సమాప్తి చెందును.

వివ:_ అట్టి పురుషులు ఇంక విషయభోగాది పరిణామమును బొందఁ డని భావము.

33. క్షణ ప్రతియోగీ పరిణామాపరాన్త నిర్గ్రాహ్యః క్రమః

సూ. క్షణము గూడ వ్యవధానము లేకయుండి పరిణామము యొక్క పర్యవసానముచే మిగులఁ దెలిసికొనఁదగినది క్రమము.

వివ:_ వస్త్రము ప్రాఁతదై చివికిపోయినపుడు దాని మార్పులోఁ గలిగిన క్రమము ఎప్పటి కప్పుడు తెలియకపోయినను సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమమైన మార్పులు గలిగి ఆ వస్త్రముయొక్క చివరి స్థూల పరిణామమును దాని బర్యవసానమును చివికిపోవుటను బట్టి యూహించినట్లె యన్ని వస్తువుల యొక్క పరిణామ క్రమమును ఊహింపవలయును. ఈ పరిణామక్రమము నిత్యముగా నుండును. నిత్యత్వము రెండు విధములు. 1 కూటస్థ నిత్యత్వము 2 పరిణామ నిత్యత్వము. ఏది పరిణమింపఁగా దాని తత్త్వము పోదో అది నిత్యము. పురుషుఁడు కూటస్థ నిత్యత్వము గలవాఁడు. బద్ధ పురుషుని యందు అది యజ్ఞానముచే చిత్తము కంటె అభిన్న మను నభిమానము వల్ల వాని వాని పరిణామమందు పరిణామాధ్యాస చేయఁబడుచున్నది. ముక్తపురుషులందుఁ బరిణామము వాస్తవము గాకపోయినను మోహముచేఁ గల్పింపఁబడినది. సృష్టి ప్రపంచము

పరిణామ నిత్యత గలది. ఈ సృష్టికి నిత్యము పరిణామము గలుగుచునే యుండును. ఆ పరిణామమున కంతులేదు. అని తెలియునది. అయితే మఱి యందఱు చనిపోయి పుట్టుదురా? అను ప్రశ్నకు విడదీసి సమాధానము చెప్పుకొనవలయును. ఆశలు నశించిన ముక్తజీవి మరలఁ బుట్టదు. ఆశలు గల బద్ధజీవుఁడు మరల మరలఁ బుట్టుచుండును. యిట్లే మనుష్య జాతి శ్రేష్ఠము కాదా అనఁగా పశువులను బట్టి శ్రేష్ఠము, దేవతలను ఋషులను బట్టి శ్రేష్ఠము గాదు. అయితే సంసారమున కంతు గలదా లేదా అనఁగా వివేకము గలవానికి సంసారము ముగియును. వివేకము లేనివానికి సంసారము ముగియదు. అని యీ క్రమమును తెలియునది.

**34.** పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతిప్రసవః
కైవల్యం స్వరూప ప్రతిష్ఠా వా చితిశక్తి రితి

సూ. చేయఁదగినవి చేయుటచే నింకఁ బొందవలసినది లేదు. కానఁ బురుషార్థములు లేని గుణములు తమ తమ కారణములందు లయ మొందుటగాని మూల స్వరూపమును పొందిన చైతన్యము గాని మోక్షమనఁబడును.

వివ:- కార్యకారణరూపమైన గుణముల యొక్క వ్యుత్థాన సమాధి విరోధ సంస్కారములు మనస్సున లయమొందును. మనస్సు అస్మిత యందును (బుద్ధ్యహంకారములందు) అది లింగకారణ మగు మహత్తత్త్వమందును అది అలింగమైన ప్రధానమందును లయమొందును "పరమాత్మయందు జీవాత్మ లయమును బొందు" నను వారి మతమున "సముద్రమున నదులకువలె బ్రహ్మమందు జీవులకు ఉపాధి లభించుటచే విభాగము లేకుండుట లయశబ్దార్థము" కాన విరోధము లేదు. ఆత్మయందు సమస్త విశేష గుణములు నశించుటయె మోక్షమని చెప్పు వైశేషికుల మతమునఁ గూడ ఉపాధి విశేష గుణములకు ఉపాధి గల దానియందు ఔపచారికార్థము చెప్పుటచే దాని నాశనమునకుఁ గూడ ఔపచారికార్థము చెప్పుట వలన" విరుద్ధముగాదు. ఆత్యంతికమైన దుఃఖనాశమె మోక్షమని

నైయాయికులు. వారి మతమున "భోగ్యభోక్తృభావ సంబంధముతో దుఃఖనాశనమె మోక్షము. సముదాయముగా మాత్రము గాదు" అనునదింతమాత్రమె విశేషము. నిత్యానందావాప్తియె మోక్షము" అనునది గూడ దుఃఖ శూన్యతారూపమైన యానందాప్తిపరముగాఁ జెప్పుకొన్నచో విరోధము లేదు. మోక్షము సిద్ధించునపుడు "విద్వాంసుఁడు శోకహర్షములను వీడును" అనుచోట హర్షపదము విషయ సుఖ పరమైనది. "నన్ను నేను తెలిసికొంటిని" అని కొందఱు ఆత్మకు కర్తృత్వమును కర్మత్వమును జెప్పుదురు. అందు ఒకటే కర్తయు కర్మయునగుట విరోధించును గాన అట్లు చెప్పరాదు. కనుక "చేతనము అధిష్ఠాత" అనుటయె యుక్తము. పురుషునికి స్వరూపమందు నిలుకడ గలుగుటయె మోక్షము. ఎల్లపుడు ప్రతిబింబరూపముగా ఉపాధిని వీడిన చైతన్యమె మోక్షము అని తేలిన సారాంశము. పురుషునికి సర్వవిధ దుఃఖముల నుండి యత్యంతము నివృత్తి గలుగుటయె పురుషారమని పర్యవసానము.

ఇది

పతంజలిచే రచింపఁబడి చర్ల వెంకమ నారాయణ శాస్త్రుల
తనయుడగు చర్ల గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన
యోగతత్త్వ దర్శనమందు మోక్ష పాదము
సంపూర్ణము.

— () —